# భాషావ్యాసాలు

40713



1072
ROP




డా॥ ఎస్. గంగప్ప, ఎం.ఎ., పిహెచ్.డి.,

# భాషా వ్యాసాలు
(వ్యాస సంపుటి)

ACC No. 1271c

రచయిత :
డా॥ ఎస్. గంగప్ప, ఎం.ఏ., పిహెచ్.డి.,
రీడర్, తెలుగుశాఖ,
నాగార్జున విశ్వవిద్యాలయం,
నాగార్జున నగర్–522 510, గుంటూరు జిల్లా.

© ఎస్. గంగప్ప.

ప్రథమ ముద్రణ : మే. 1985

ప్రతులు : 1000

వెల : రూ. 12/-

ప్రతులకు :
శ్రీమతి ఎస్. పార్వతమ్మ,
శశి ప్రచురణలు,
సి–73, శ్రీనివాసనగర్ కాలనీ,
గుంటూరు–522 006.

ముద్రణ : వైష్ణవి ప్రింటర్స్, గుంటూరు–1. ఫోన్ 25383.

# విషయ సూచిక

# భూమిక

నాలోని జిజ్ఞాస, సత్యాన్వేషణ అనే అంశాలు నా విద్యార్థిదశనుంచి సదా నన్ను వెంటాడుతూనేఉన్నాయి. అనర్సులో నా అభిమాన విషయం భాషాశాస్త్రమే. అంతే కాక ప్రత్యేకంగా పూనా వేసవిపాఠశాలలో భాషా శాస్త్రాధ్యయనం ప్రొఫెసర్ బీలిస్కార్ వంటి మహావిద్వాంసుల సన్నిధిలో చేయడంవల్లనూ, ఆనర్సులో ఆచార్య భద్రిరాజు కృష్ణమూర్తిగారివద్ద చదవడంవల్లనూ భాషాశాస్త్రంమీది అభిమానం పెరిగి పెద్దదయింది. అయితే వృత్తిరీత్యా నేను భాషాశాస్త్రంకంటే సాహిత్యంమీదే అధిక కృషిచేయడం జరిగింది. విద్యాబోధన, పరిశోధన రెంటిని కొనసాగిస్తూ వ్యాసాలు, గ్రంథాలు నా ఓపికమేరకు కృషిచేసి ప్రకటించాను. ఈనాటికి నా 'భాషావ్యాసాలు' గ్రంథరూపం ధరించాయి.

ఇందులో ఎనిమిది వ్యాసాలున్నాయి. జానపద సాహిత్యంలోని భాష, తెలుగు ప్రముఖ వాగ్గేయకారులు అన్నమాచార్యులు క్షేత్రయ్య, సారంగపాణి పదాల్లోని భాష, రాయలసీమ మాండలికం, వేమనపద్యాల్లోని రాయలసీమ మాండలికం, కోలాచలం శ్రీనివాసరావు నాటకాల్లోని అన్యదేశ్యాలు, మాలపల్లి నవలలోని భాషా విశేషాలు వివిధ దృక్కోణాలనుంచి భాషా శాస్త్రానుసారం అధ్యయనంచేసి, పరిశోధించి, విశ్లేషించి, వ్యాసరచనచేసి, ప్రకటించడం జరిగింది. నా ఇతర రచనల్లాగే నా యీ 'భాషావ్యాసాలు' సాహిత్యాభిమానులకూ, విద్యార్థులకు ఉపకరిస్తే నా కృషి ఫలించినట్లు భావిస్తాను.



ఆచార్య జి.ఎన్. రెడ్డి, ఎం ఏ, ఎం లిట్., పిహెచ్ డి,

వైస్‌ఛాన్సలర్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం.

వినిర్మల పరిపాలనాదక్షులు
విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు
ఉన్నతప్రమాణాల విద్యాశిక్షకులు
ఉత్తమపరిశోధనా పర్యవేక్షకులు

ఆచార్య జి యస్ రెడ్డి వర్యులకు
అరమరికలేని అస్మదాచార్యులకు
సమర్పిస్తున్నా నా 'భాషావ్యాసాలు'
సద్విమర్శక శోధనాంశాలు !

— డా॥ ఎస్. గంగప్ప.

# జానపద గేయాల్లోని భాషానుశీలన

0.0 ఆధునిక యుగంలో జానపద విజ్ఞానంపై సాహిత్యకారులకు, పరిశోధక విమర్శకులకు అత్యంత అభిమానం కలిగింది. ఇది కేవలము తెలుగుసీమకి, భారతావనికీ మాత్రమే పరిమితం కాదు. ప్రపంచ వ్యాప్తమైంది. ఇది అభినందనీయమే కాదు, ఆనందించదగ్గది. సమస్త విజ్ఞానానికి పునాది జానపద విజ్ఞానమన్న విషయం అందరికీ తెలిసిందే. చదుష సందెలు, భాషాశాస్త్రం, విజ్ఞానం అభివృద్ధి చెందడం మూలాన్నే ప్రజలు ఈజానపద విజ్ఞానంపై పరిశోధించడం ఆరంభించారు. చక్కటి ఫలితాన్ని సాధిస్తున్నారు తన్మూలంగా మానవ సంస్కృతిలో వచ్చిన క్రమపరిణతి సువ్యక్తమై మన పురోగతికి ఉపకరిస్తుందనడంలో సందేహంలేదు

1.0 ఈనాడు తెలుగు జానపద సాహిత్యంపై జానపద కళలపై ముదావహమైన పరిశోధన జరుగుతూంది తెలుగుసీమలోనేగాక కర్ణాటక, తమిళనాడుల లోను అత్యంతాసక్తితో పరిశోధనచేసి పలువురు పెద్దలు ప్రసిద్ధికెక్కారు. ఎనలేని సేవచేశారు. అనేకులు డాక్టరేటు పట్టాలు పొంది జానపద సాహిత్యానికి మహోన్నత స్థానం కల్పించారు దానిమీద అత్యంతాభిమానం ఉన్నవాళ్ళెందరో సాహిత్యవేత్తలు నూరార్లు జానపద గేయాల్ని సేకరించి, అనేక దృక్కోణాల నుంచి పరిశోధించి, పరిశీలించి, విశ్లేషణ గావించి వ్యాసాలు, గ్రంథాలు ప్రకటిస్తున్నారు. తెలుగు జానపద గేయాల్ని సేకరించి, జానపద కళల్ని ఆదరించి, వాటి ప్రచారార్థం పాటుపడుతూ సేవచేస్తున్న వాళ్ళెందరో మహానుభావులు, వారు మన అభినందనార్హులు. ఈ జానపద విజ్ఞానాన్ని తవ్వి బయటకుతీసి వెలుగులోకి తీసుకురావడమంటే మన జాతి సాంఘిక జీవనాన్ని, సంస్కృతిని వెలికితీయడమే అని అర్థం.

1.1 జానపద సాహిత్యంపై నాకున్న మక్కువకొద్దీ నేను సైతం రకరకాల గేయాల్ని సేకరించాను; అనేక వ్యాసాలు వివిధ పత్రికల్లో ప్రకటించాను. నాయీ జానపద గేయాల సేకరణ అనంతపుర మండలం పెనుకొండ తాలూకాకు మాత్రమే పరిమిదం పెనుగొండ చుట్టుపక్కల ఉన్న మా పల్లెలోని జానపదుల నోటివెంట వెలువడ్డ పాటల్ని నేను సేకరించాను వాటిలో వివిధ రకాలున్నాయి. నాట్లు వేసేటప్పుడు పాడే పాటలున్నాయి విసర్రాయి విసిరేటప్పుడు, పడ్లు దంచే

టప్పుడు పాడే పాటలున్నాయి. ఇవన్నీ పనిభారాన్ని మరచిపోయి హాయిగా కులాసా జీవితం కొనసాగడం కోసం పాడుకొనే పాటలు. కాని కాలక్షేపం కోసం, వినోదం కోసం పాడే పాటలూ ఉన్నాయి. వాటిలో చెప్పుకోదగ్గవి కోలన్న పాటలు, ఊయల పాటలు, చంద్రమ్మ పాటలు, ఇంకా నలుగు పాటలున్నాయి. ఇంతేగాక భగవత్ప రంగా మేలుకొలుపులు, పవ్వళింపు పాటలున్నాయి. ఈ పాటల యితివృత్తాలు కేవలం పౌరాణికాలేగాక, చారిత్రకాలు, సాంఘికాలున్నాయి. ఇందులో శృంగారాది నవరసాలే గాక భక్తి, వైరాగ్య, తాత్త్విక సంబంధి రసపుష్టమైన గేయాలున్నాయి. ఈ గేయాలు కేవలం వినోదం మాత్రమేగాక విజ్ఞానాన్ని సైతం అందించేవిగా ఉండడం విశేషం. మన శిష్టసాహిత్యానికి సైతం కొన్ని పట్టుల మూలం ఈ జానపద సాహిత్యమే అనడానికి తగిన సాక్ష్యాధారాలున్నాయి. లేదా శిష్టసాహిత్యం తెలిసిన కవి లేదా కవయిత్రి జానపదుల కోసం ఈ పాటలు అల్లడం జరిగి ఉండవచ్చు. ఏది ఏమైనా ఈ నా సేకరణలో జానపదుల గేయాలు పైని పేర్కొన్న వీటన్నిటికి చక్కటి ఉదాహరణలు.

1.2 జానపద సాహిత్యంపై జానపద కళలపై అభిరుచి కలిగిన వాళ్ళంతా యినుమడించిన ఉత్సాహంతో, అత్యంతాసక్తితో వీటిని సేకరించి భద్రపరచవలసిన అగత్యం ఎంతైనా ఉంది. కారణం కొంతకాలం క్రితం విన్న ఈ పాటలు ఈనాడు మనకు వినిపించడంలేదు. ఇలా కొంతకాలం పోతే వీటి ఆచూకీ లేకుండా పోయే ప్రమాదం ఉందనిపిస్తుంది. కారణాలు ఆధునిక యుగంలో మానవ మేధాసంపత్తితో, వైజ్ఞానిక రంగంలో వచ్చిన ప్రగతి, పారిశ్రామికీకరణ ప్రభావమూను. నాట్లు వేసేటప్పుడు, కలుపుతీతల సమయంలో వరుసలు, వరుసలుగా స్త్రీ సముదాయం కమ్మని కలకంఠ నాదాలతో పంచమస్వరంలో పాడుతూ ఉంటే ఎంతో ఆనందదాయకంగా ఉంటుంది.

> 'కంచుగారో ళ్ళాడబిడ్డా కంపశీముక్కారి పాపా
> ఇంత సొంపుగ నెవరు పూసిరే అమ్మణ్ణి వినవే ॥ఇంత॥
> కంకణాలు చేతిమీద సొంపుగా నే నిద్రపోతే కంటెనీలాలు
> ఒత్తుకొన్నయో ఔరౌర జాన కంటె నీలాలు ఒత్తుకొన్నయో'

మొదలైన పాటలు ఈనాడు వినిపిస్తూనే ఉంటాయి

ఇలాగే ఇంకా నిసర్గ మనోజ్ఞంగా ఊరిముందర ఆరుబయట సిందారబోసి నట్లుండే వెన్నెల్లో ఆడుతూ పాడుతూ వేసే కోలాటం కమనీయంగా ఉంటుంది అది దర్శనీయిమేగాని వర్ణనకు సాధ్యం కానిది.

'చిన్నిదో చిన్నదాన్నిరా
కముగుట్ల కొండమీద కలిసి నాస్వామి చిన్నదో చిన్నదాన్నిరా
వజ్రాలు తెచ్చి వాగిట్లోనే పోసి
వొదినా మరదండ్లతో వాదొచ్చె రాజా ॥చిన్నదో॥

అనే పాటగాని, లేదా —

'అదిగదిగో అనంతపురము అంచనా టెంకాయవనమూ
పక్కలోనే పామిడేరన్నా
ఓయమ్మ జాన వచ్చికొవ్విరి వాలలాడన్నా॥'

అనే పాటగాని, ఇంతకంటే మరింత మనోరంజకమైన —

'బండీరా పగబండిరా దొరలెక్కేది రైల్‌బండిరా ॥బండీరా॥
దొరల్లెక్కేది బండిరా, దొరసానులెక్కేది బండిరా
రాణిలెక్కేది బండిరా రాజులెక్కేది బండిరా
జాతోడెక్కేది బండీరా ॥బండీరా॥
బండిచూస్తే ఇనుమురా దానికూత ఎంతో నయ్యమురా
బండీ ఎంతో నయ్యమురా దానికూత ఎంత చక్కనరా' ॥బండీరా॥

ఇలాంటి పాటలెన్నో పాడుతూ, ఆడుతూ ఆనందిస్తూ చూపరులను సైతం ఆనందింపజేస్తుంటారు కోలన్న ఆటగాళ్ళు ఈ ఆటాపాటా ఇప్పుడు మా పల్లెటూరు వెళ్ళినప్పుడు చూచి, విని ఆనందిస్తూ ఉంటాను.

కాని దురదృష్టవశాత్తూ నా బాల్యంలో నేను విన్న విసర్రాతి పాటలు, కపిల పాటలు ఈనాడు పాడేవారు కరువయ్యారు. ఇందుకు వైజ్ఞానిక రంగంలో వచ్చిన ప్రగతి, పారిశ్రామికీకరణము కారణాలని నేనిందాకే పేర్కొన్నాను. విసర్రాతిని మాప్రాంతంలో రాగరాయి అంటారు. అంటే రాగులే ఎక్కువగా విసురుతారు గనుక అలా వాడుక వచ్చింది.

'రాగులిసరాలేసు రాయె తాలేసు
రాజ్యాలు యేలేటి రాజాబిడ్డాను
వొడ్లు దంచాలేసు వాయె తలేసూ
వాకిల్లో కూచోనీ వాదులాడేసు'

ఇలా ఉంటాయి రాగరాయి పాటలు, ఇంతకంటే ఉదయాన్నే కోడికూతతో మేల్కొని పొలం వెళ్ళి కపిన తోలుతూ పాడే కపిలపాటలు మొరటు శృంగారమే యితివృత్తం గలవైనా – అవి పల్లెటూరి ప్రజలకు సహజ సుందరమై ఒప్పుతుంటాయి.

'పగలు పగలు పొడుతాపె పగలెల్లా నగుతాపె
పగలాడీ నీపొందు ఒక్కనాడే చాలులేయా'॥ అని ఒక నాయకుడు –
వొస్తా పోతాఉన్న చాలు వాగిల్లో నిలబడినా చాలూ
నీ నీలంపు గాజుల చెయ్యి నీలాలు పారినాచాలు'

అని మరో నాయకుడు కోరుకొంటాడు. ఇలాగే

'దొవ్వచేను దున్నొద్దు మామా దిన్నెలెక్కి చూడలేను
ఊరిముందర చేను చెయ్రా నీళ్ళకొచ్చి నిన్ను చూతూ'

అని ఒక నాయిక –

'నీళ్ళకంటా నేనుపస్తీ నిన్ను జూడ వొస్తికదరా
నీళ్ళరేవులో నీవూలేవూ కంటినీరే కడవనిండో'

అని మరో నాయిక తన ప్రియుణ్ణికానక పొందిన విరహం కరుణరస పరిప్లావితం చేస్తూంది ఆనంద నిష్యంది అయింది. ఇంతకంటె కవిత ఉంటుందా ? ఇంతకు ఇలాంటి పాటలు ఈనాడు వినిపించడంలేదు. విస్తరాయి విసిరేవాళ్లగాని, కపిలతోలే వాళ్ళుగాని లేరు. ఇక పాటలెలా వస్తాయి ? పిండిమరలు, ఆయిల్ యింజన్లు, విద్యుత్తున్నచోట మోటార్లు పై పనులు చేస్తున్నాయి మనవాళ్ళు ఈ పాటల్ని మరచిపోతున్నారు ఇలాంటి జానపద గేయసంపదని సంపాదించి, భద్రపరచవలసిన అగత్యం ఎంతైనా ఉందని పేర్కొనడంలోని ఆంతర్యం ఇదే.

ఇంతకు ఇన్ని ఉదాహరణలివ్వడంలో ఒక ప్రధానాంశముంది. పై గేయాలోని భాష సరళమై భావస్ఫోరకమై, రసనిష్యందియై, పైపెచ్చు జానపదులకు సహ

జమ్మె, వారి విజ్ఞానానికి, వినోదానికి, అర్థ గ్రహణ శక్తికీ తగినట్లుందని చెప్పడమే నా ఆశయం. సంస్కృత సమాస భూయిష్ఠమైన ప్రౌఢ సాహిత్యం జానపదులకందని చందమామ. దానివల్ల ప్రయోజనం లేదుకదా! ఇలాంటి గేయాల్లోని భాషా వైభవాన్ని పరిశీలిద్దాం.

2.0 పదబంధాలు : పదాలు, పదబంధాలు పామర ప్రజల వాడుకలో ఎంతో మార్పుచెందాయి. కొన్ని సందర్భాలలో క్రొత్త అర్థాలు సైతం సంతరించుకొన్నాయి.

2.1 కొన్ని పదాలు చాలా మార్పులు చెందినట్లు స్పష్టమవుతుంది.
అన్నేకారి < అన్యాయకారి; సిరియ < స్త్రీ;
సోజకము/సోజ్యము < చోద్యము

ఇంతెందుకు వ్యక్తుల నామాలు ఎలా మార్పుచెందాయో పరిశీలించండి. రావున్న < (రావణుడు అనడానికి); ఇంద్రజిత్తుడు < (ఇంద్రజి, ఇంద్రజిత్తు); యిప్వీసన్న < (విభీషణుడు అనడానికి); రాగవల సీత < (రాఘవుల సీత అంటే రాఘవుని భార్యఅయిన సీత); భర్తీశత్రీకులు < (భరత, శత్రుఘ్నులు అనడానికి). చాలా జాగరూకతతో పరిశీలిస్తే తప్పక మనకర్థం కానంత మార్పుచెందిన మాటలున్నాయి కానీ అలాంటివి చాలా తక్కువే అని చెప్పాలి.

2.2 మా పల్లెలోను, పరిసరాల్లోను చాలవరకు రాయలసీమలోను తమాషా అయిన పదబంధాలు, పలుకుబళ్ళు ఉన్నాయి. ఒడిబాలు : ఆడపడుచులకు ఇంటి వాళ్ళిచ్చే చీరా, రవిక, పసుపు, కుంకుమ, కొబ్బరికాయ, బియ్యము వాస్తవానికిది కలిగిన వాళ్ళిచ్చే సారెలాంటిది.

ఓయప్ప లక్ష్మణా : అప్ప-తండ్రినే గాక, గౌరవార్థంలో సంబోధనలో ప్రయుక్తమవుతుంది.

ఓలి నేసెరుగా : ఓలి-కన్యాశుల్కం వాస్తవానికిది రాయలసీమలో కొన్ని కులాల్లో ఈనాడుంది.

కల్లి మాను : పచ్చగా ఉండి, దాని కొమ్మలు, రెమ్మలు విరిస్తే చిక్కటి పాలవంటి జిగురు కారుతుంది.

కాసి కప్పడము : కాసి_కొండల్లోని బోదగడ్డి _ దాంతో యింటి పై భాగాన్ని కప్పుతారు అవే పూరిళ్ళు.

జలజారు : జలజారి <జలదారి < నీరుపెళ్ళే దారి అయినా స్నానాలు చేసే గదిలాంటిది.

జాలికాయ : తుమ్మకాయ.

తద్రంచుకొచ్చు } : అంచకొచ్చు దగ్గరకు, వద్దకు వచ్చిందని అర్థం.
తల్లంచుకొచ్చు } : అంచున అంటే దగ్గరన్న అర్థంలో
'అదిగదిగో అనంతపురము
అంచనా పెంకాయవనము'

పొయ్యేల్ల యీబూది } : పొయి_పయి_శరీరమనే అర్థంలో
పొయ్యేల్ల గీసుకొని } : ప్రయుక్తం

2.3 ఇంకా విలక్షణ ప్రయోగాలు సైతం ఈ గేయాల్లో ప్రయుక్తం కావడం మనం గమనించవచ్చు.

అడవిపై అజనాలు : అజనాలు : అధికారమన్న అర్థంలో
(అడవిపై అజనాలు రాములకే అయ)

అతియచక్కని తమ్ముడా । = (మిక్కిలి చక్కటి తమ్ముడా)

ఉదకమాడుకోని : జలకమాడుకోని, అంటే స్నానంచేసి
(ఏటికిపోయిన ఉదకమాడుకోని ఏగిరానొచ్చెనో)

ఉదకమాయా : ఉదకం _ నీళ్ళు, నీళ్ళాడిందని అర్థం, దీనికి సంస్కృతీకరణము ఉదకమాయా (రతనంగి ఉదకమాయా)

జగనజోతి : పెద్ద జ్యోతి.

వాలుకూరలు : వాలుణ్ణి చంపి వండిన కూరలు
(వాలుకూరలు లేనిదే భోంచేయనే)

రాముడు పురుషుడు : రాముడు భర్త

ఇలాంటి ఉదాహరణలను ఎన్నైనా చూపవచ్చును.

3.0 సామెతలు : జానపదుల భాషలో చక్కటి సామెతలు కోకొల్లలు వాస్తవానికి ఈనాడు నగరులకంటె పల్లెటూళ్ళే ఈ సామెతల పుట్టలు జానపద గేయాల్లోని సామెతలు అమెతలై ఆనందాపాదులై ఉంటాయి

3.1 'ఎద్దుకొమ్ములవోలె ఇద్దరే ఉంటిమో ఒంటిగాణ్ణయితినో' అని లక్ష్మణ మూర్ఛా సమయంలో దుఃఖిస్తూ రాముడన్న మాటలలో అపరిమితార్థం యిందులో ఉంది ఎద్దుకి కొమ్ములు ప్రధానమైనవి వాటిలో ఒకటిపోతే మరొకటి ఉన్నా పోయినదానితో సమానం ఈ సామెత మనకు మరో సామెత 'ఒంటికొమ్ము కొమ్ముగాదు. ఒంటికొడుకు కొడుకుగాదు' (లేదా ఒంటికన్ను కన్నుకాదు) ఉన్న దాన్ని గుర్తుకు తెస్తుంది లక్ష్మణ విరహితంగా తనకు సుఖంలేదని శ్రీరాముని మాటలకర్థం ఇలావే తక్కిన మరికొన్ని సామెతలు.

'కూడినంకా కూడవల్ల కుర్రపాయము చిన్నదాన్నీ, ఏలినంకా ఏలవల్ల పెండ్లి గాని చిన్నదాన్నీ' 'నుసిపోట్నీ నూగులకీ నూనెక్కడిదీ, వాడినా చెరుకులకీ పాలేడ కలవయ్యా'

'మసిబూసి మామిడిపండ్ల మ్మ నొ స్సి వామానము బోయినంకా'

(మసిబూసి మారేడుపండు అనడం ప్రసిద్ధం, ఇక్కడ మామిడి పండ్లని ప్రయుక్తం)

'మునుగు పువ్వా ముడవరాదా ముండవోందా జెయ్యరాదా
చేతినిండా గాజులుంటే చెయ్యవల్ల చెలియపోందూ'

4.0 ధ్వనుల మార్పులు : జానపద గేయాల్లోని పామరుల ఉచ్చారణలో అనేక ధ్వనుల మార్పులు రకరకాలుగా కనిపిస్తాయి

4.1 ఈ గేయాల్లో అ/ఆ లకు ఎ/ఏ లకు మధ్యగా అంటే ఇంగ్లీషులో 'a' అక్షరోచ్చారణతో దాదాపు సమంగా ఉచ్చారణ కనిపిస్తుంది య/యా పదాల కలయిలో: నూనేడ, నూనెక్కడ; పాలేడ, వొచ్చే, దండాన < దండెమున; పానీల్లు < పేడనీళ్ళు; కొడుకు పుట్టానని

4.2.1 పదాది 'అ' 'ఎ'గా మారింది : కెరకంచు < కరకంచు, కెలియ పూలు < కలికిపూలు; గెళ్ల < గళ్ల (గడియలు).

4.2.2 కొన్నింటి పదాది 'అ' 'ఒ'గా మారింది; ఒ < అ.

పదాలు : పొసుపులు, పొణతులు, పొరువు, మొగునికీ, మొకరి; క్రియలు : తొడిసెరా < తడిసెరా; పొట్నీ < పుట్టిన (నుసిపట్నీ నూగులకీ); పొరిపించు.

4.3 పదాది 'ఒ'కి బదులు 'అ' వచ్చింది కృతక ప్రామాణికం కావచ్చు. పన్నుమాను < పొన్నమాను; పరక < పొరక (చీపురు); పద్దన < పొద్దున < ప్రొద్దున.

4.4 దీర్ఘత లోపించి హ్రస్వత పదమధ్యంలో వచ్చింది.

రత్నంగి < రత్నాంగి; పస్తదు < పస్తాదు; జవ్వజి < జవ్వాజి.

4.5 పదాదిని దీర్ఘత : కావాట బంధనము, వీబూది, తాలార్లు, దీవాన్లు, మాలారము,

4.5.1 పదమధ్య హ్రస్వానికి బదులు దీర్ఘత : పప్పూలు < పప్పులు.

4.6 దీర్ఘానికి బదులు పదమధ్యంలో పూర్ణానుస్వారం.

తప్పినంకా < తప్పినాక; గుడిదంకా < గుడిదాకా; తొడమిందా < తొడమీద.

4.7.1 మహాప్రాణత పోయి అల్పప్రాణత : బందనము < బంధనము, బీమన్న < భీమన్న; డిల్లీ < ఢిల్లీ; విబూది < విభూతి; బూపతి < భూపతి.

4.7.2 లేని మహాప్రాణత : ఫణతి < ఫ్రీ < పణతి < పడతి.

4.8.1 పదమధ్య స్వరలోపం :

పదాల్లో : ముంద్ర <ముందర; ఈట్లతో <ఈ సెలతో; మాట్లు < మాటలు; కుండ్లు < కుండలు.

4.8.2 పదబంధాల్లో స్వరలోపం : ఇల్వాకిలి, ఊర్వాకిలి.

4.9. స్వరభక్తి : మంతరించి < మంత్రించి; రతనంగి < రత్నాంగి; పితరంగి < చిత్రాంగి; రుద్దురాక్ష < రుద్రాక్ష; సిరిదేవి < శ్రీదేవి; సుక్కారారము < శుక్రవారము; చెందురుడు < చంద్రుడు; తలంబురాలు < తలంబ్రాలు; తూరుపు < తూర్పు.

4.10 లోపదీర్ఘత : దీయ (దీయాలె త్తేతలికి), దీయ < దివియ, దండాన < దండెమున, దండాలు < దండములు, గుండాలు < గుండములు

4.11 పదమధ్యంలోని శ్వాసవత్స్పర్శాలు, నాదవత్స్పర్శాలయ్యాయి. ఆగుతోట < అకుతోట, కొడుకొగడు < కొడుకొకడు బిడ్డొగతె < (బిడ్డ+ఒకతె), ఒగసెయ్యి < ఒకచేయి; సగినము < శకునము,

4.12 చ_స; చ_శ, స_శల వినిమయం 'చ'కు బదులు 'శ', కుశములు < కుచములు, 'చ'కు 'స'_ఊతసాప, 'శ'కు బదులు 'స' సగినము < శకునము.

4.13 ద్విరుక్త 'జ' ద్విరుక్త 'ద'గాను, ద్విరుక్త 'ద' ద్విరుక్త 'జ'గాను మారింది. సొద్దెన్ను < సజ్జన్ను; పజ్జెనిమిది < పద్దెనిమిది

4.14.1 పదమధ్య 'డ' 'ర'గా మారడం. పచ్చరము < పచ్చడము; సొంగరీలు < సంగడీడు_సంగడీలు; మరత < మడత.

4.14.2 'డ'కు బదులు 'ణ': పణతి < పడతి.

4.14.3 'ణ'కు బదులు 'న': జాన < జాణ; మునికిరీటములు < మణికిరీటములు; తోరనాలు < తోరణాలు; ఏనుగానం < వేణుగానం.

4.14 4 'ణ' కారానికి బదులు 'ంద', 'ండ' కారాలు, బిందాసరము < బిణ్ణసరము; బిండసరము < బిణ్ణసరము.

4.14.5 పూర్ణానుస్వారంబదులు 'ణ' కారం ఇణుతులుండారు.

4.15 ద్విత్వ 'న'కు 'ంబ' వచ్చింది. చీరలుండాయి; సొమ్ములుండాయి, రైకలుండాయి; ఇణుతులుండారు, 'ఉన్నాయి' అన్న రూపమూఉంది.

4.15.2 'న'కు బదులు 'ణ': దవణము < దవనము.

4.16 యకార, వవూ, వొవోల ప్రయోగం : వొట్టిపోసువు, వూరికి వుత్త రావ, యిది, యెలది, యేనుగానం.

4.17 'ళ'కు బదులు 'ల' : ఎల్లుతానె < వెళ్ళగానే; తాలుమవి < తాళ మని, తాలాలు < తాళాలు, మేలాలు < మేళాలు. బిల్ల చెప్పులు < బిళ్ళచెప్పులు.

4.18.1 'వ'కు బదులు 'గ' : నూగులకీ < నూవులకీ; వగుతానె < నవుతానె < నవ్వుతానె; దిగితెల్లవారె < దివితెల్లవారె.

4.18.2 పదాది 'వ' 'య'గా మారింది : యాగటి < వేగటి < ప్రేకటి

4.18 3 పదాంత్య 'వ' య'గా మారింది : చేదబాయో < చేదబావి;

4.19 పదాది సొ/సో, స్వ/స్వా మారడం : స్వంతం < సొంతం: స్వోవ < సొవ.

4.20 పదమధ్య 'హ' 'వ'గా మారింది. రోవణి < రోహిణి, దావ రానికి < దాహానికి.

4.21 అద్విరుక్తత : ఎవుడొ ప్తిపీ < ఎప్పుడు, ఇవుడు < ఇప్పుడు; నీసతువ < సత్తువ, కొవిని < క్రొవ్విన.

4.22 లేనిద్విరుక్తత వచ్చింది (పిరిగంధపు) చెక్కల్లు < చెక్కలు; అవ్వన్ని < అవన్ని < అవి+అన్ని; నిప్పల్లు < నిప్పులు: సవ్వారి < సవారి, నీళ్ళవేణి < నీలవేణి, వయివున్న < వయివున; నిమ్మల్లు, పొన్నల్లు, రాగుల్లు, రవ్వ దూళి, పొవ్వదూళి, వ్రైరికూటిలోకి.

4.23 కృతక ప్రామాణికత : వెదకతొన్నవన్న < ఎదకే; ఉత్తరించా < ఉత్తరించా; ద్రుష్టరాకసి < దుష్టరాకసి.

5.0 సంధి : ఈ గేయాలభాషలో పాటలువాడుకలో వ్యాకరణానికి ఒదగనిరూపాలు అనేకం సంధికార్యం వ్యాకరణబద్ధం కాని రీతిని జరిగినట్లు స్పష్టం. ఇది సహజమైన వాడుకభాష.

5.1 అత్వసంధి ; మనమ్మ < మన+అమ్మ: అమ్మొండు < అమ్మ + ఉండు, అక్కొండు < అక్క+ఉండు, అత్తిండ్లు < అత్త+ఇండ్లు, అమ్మమ్మ < అమ్మ+అమ్మ: పెద్దత్త < పెద్ద+అత్త.

5.2 ఇత్వసంధి : తల్లుండు < తల్లి+ఉండు, తండ్రుండు < తండ్రి+ఉండు, చెల్లుండు < చెల్లి+ఉండు; తల్లితల్లంటావు, తల్లంచుకొచ్చా, తండ్రంచుకొచ్చా.

5.3 క్త్వార్థకేకారసంధి జరుగలేదుగాని 'య' డాగమానికిబదులు 'వ' గాగమం : వొత్తివొత్తి.

5.4 ఉత్తరపదాది లోపించి 'ఎ, ఒ'లు వచ్చి సంధిగలగడం, ఎముకలిరుతాము; కూతేశ; పైటలేసుకోని, బాలుడెంకాటరెడ్డి, బూమండలమెలగాయ, ఈడోరు, జోడోరు. కంచుగారోళ్ళాడబిడ్డ, పిల్లోళ్ళకి–

6.0 సమాసాలు : జానపదుల వాడుకలో సమాసకల్పనం కన్పిస్తుంది. ఇది కావాలని పట్టుబట్టి చేసినదేమీకాదు. పామరులు పాడుకొనే సందర్భంలో అలవోకగా వాటికవేవచ్చి కుదురుకొన్నసమాసాలు.

6.1 తెలుగు+తెలుగు : కురుసూగుమ్మాలు; వాడినచెఱుకులు, బూదుకోళ్ళు, కారుకోళ్ళు, మట్టిగోడలు, రాళ్ళవాన, ఒంటెద్దుబండి.

6.2 తెలుగు+సంస్కృతము : అప్పదానము.

6.3 తెలుగు+అన్యదేశము : పదివరహాలు, మరలగాడి.

6.4 సంస్కృతం+సంస్కృతం : పుణ్యసంపన్న(రాలు), జంగమలింగ, అన్నదానము, కవాట (కావాట) బంద(ధ)నము, గోపీస్త్రీలు, అరిరాములసేన, సంతానవ్రతము.

6.5 సంస్కృతం+తెలుగు : మధనగొల్లది, వరామొగునికి, మాయలేడి, సంజీవకొండ.

6.6 సంస్కృతం+అన్యదేశం : బూవతీదివాన్లు.

6.7 అన్యదేశం+తెలుగు : బూడ్సుదెబ్బ, లేపుదిండా (?) సావుకారిబిడ్డ, అలేకారిబిడ్డ.

7.0 క్రియలు : జానపదగేయాల్లోని, భాషలోని క్రియారూపాలుసైతం తదుచితరీతిలోనే ఉండటం మనం గమనించవచ్చు.

7.1 'చు' వర్ణాంతధాతువుల ఆద్యక్షరంమీది భాగానికి 'స్తు' ఆదేశమవుతుంది. తె_స్తీవిగా, ఒస్తానమ్మా, ఎవ్వుడో_స్తివి, ఇప్పుడీ_స్తినక్క_మ్మా, వస్తాను.

7.2 భూతకాలం : భూమండలమెలుగాయా < (వెలుగాయెను), సిరెత్తుబోయా, నెగరికిబోయా,

7.3 'ఎడి'కి బదులు 'ఏటి' కన్పిస్తుంది : 1. నిగనిగమనేటి, సీతమ్మగట్టేటి, ఇంట నుండేటివారు; 2. ఇంకా తృవర్ణకార్థంలో పూయంగ, పొగంగ, పిండంగ,

7.4 చేదర్థకం : నమ్మేవుంటే.

7.5 ప్రార్థనార్థకంలో : తెలపరమ్మా, యిన్నపములు సేయరమ్మా, సేకొనమ్మ, పాడేగట్టమ్మ, యిడిమర, పెట్టుమయ్య (మాల్లా), పిలీ (పిలువుము).

7.6 ఉభయ ప్రార్థనార్థకంలో : పదరమ్మ పోదాము, రార చూతము, రారా చూతాము.

7.7 తద్ధర్మార్థక రూపాలు : పొరువు పొరిసొచ్చే తపుడు, ఇప్పేతప్పుడు, సేపేతపుడు, యెల్లుతానె, మొక్కు_తానే, నగుతానె, ఆదేవి కదలుతా బూదేవి కదిలా.

7.8 విధ్యర్థకం : ఎదకండి, పట్టండి, ఆవులు కాయి.

7.9 వ్యతిరేకార్థంలో : ఇచ్చెల్లేదు < ఇవ్వను.

7.10 కొనుధాతువు ప్రయుక్తమైనపుడ 'కో' పదాంశం కన్పిస్తుంది : తీసుకోవాలి, సేకొనమ్మా, ఒప్పుకోవాయ్యా/కోవల్ల.

7.11 బోంచేతురు (బోం+చేతురు) < బోనం < ప్రాకృతం 'భోఅ' భోయణ– < సంస్కృతం–భోజన)*

---

* ప్రొఫెసర్ తూమాటి దొణప్ప — తెలుగు హరికథా సర్వస్వం– పు. 329.

8.0 అన్యదేశ్యాలు : ఈ జానపదుల భాషలో సమకాలికమైన ఇతర భాషా పదాలు వచ్చి చోటుచేసుకొన్నాయి. అరబ్బీ, పారశీ, హిందీ, ఉర్దూ పదాలు, తమిళ, కన్నడ పదాలతోపాటు చివరకు ఆంగ్ల పదాలు కూడ వచ్చిచేరాయి.

8.1 అరబ్బీ, పార్శీ, ఉర్దు, హిందీ : ఆలేకారి, కబేరి, కర్చు, కుర్చీ, జగడమాయ, జరీ, జాబు, చెక్కీలు, తురక (దండు) దట్టీ, దీవాన్లు, బేరము, రుమాల, వరహాలు, శాలువా, సవ్వారి, షావుకారి.

8.2 ఆంగ్ల పదాలు : క్రెంటు, టేకు (మాను), బూడ్సు, (దెబ్బ), రైల్ (బండిరా), రోటు (రోడ్డు).

8.3 కన్నడం : (నేల) మాళిగ, హెచ్చు.

8.4 తమిళం : తిరుమణి.

9.0 వాక్య నిర్మాణం : ఏ భాషకైనా ఆయువుపట్టు వాక్య నిర్మాణమన్న విషయం విజ్ఞులందరికీ సువిదితమే. ఈ జానపద గేయాల్లో తెలుగువాక్య నిర్మాణ రీతి సుస్పష్టం. అయినా అక్కడక్కడ కొన్ని వింత ప్రయోగాలు వాక్యనిర్మాణంలో కనిపిస్తాయి. అలాంటి వాటిని కొన్నింటిని మాత్రమే ఉదాహరించడం జరిగింది.

9.1 'చిగురాకు విడియాలు నోరెర్ర గయ్యింది. అది నీళ్ళు కడగల్ల' (చిత్రమైన రచన).

1.1 క్రియారహితంగా : ('నీలార కన్నెలకు ఒక చేదబాయో, ఒక చేద బాయికి ఒక చేదబిళ్ళో').

2.1 అక్కుండు, చెల్లుండు, అన్నుండు, తమ్ముడుండు.

ఒగురేళ ఓగురొదురో నాకందకు (చిన్నచిన్న వాక్యాలతో పెద్దవాక్యం)

3.1 ఆవులు కొండమిందా గోపాలు కాసుతుంటే గోపాలు డానుకొంటే (చిత్రమైన వాక్యం).

4.1 ఇంటిలోకి నన్ను బిలిసి ఈనపోనం మాటలాడి దక్షిణా తాంబూల మందెనో (అందించాడు అనటానికి)

5.1 ఊది నాదే గాదిలావు జంగాములింగా (ఊదినాదే అనడానికి).

6.1 కాంత కొంగులు పట్టి విడజాలయా (విడువజాలడాయె).

10.0 పై పరిశీలనవల్ల రాయలసీమలో ముఖ్యంగా అనంతపురం మండలంలోని పెనుగొండ పరిసరాల జానపద భాషారీతులు స్పష్టం. వాస్తవానికి వ్యాకరణ సూత్రాల దృష్టిలో ఈ భాష శిష్టసాహిత్య భాషతో సరితూగక పోవచ్చుగాక. ఆధునిక భాషాశాస్త్ర సూత్రాలకు మాత్రం అది ఒదిగిఉండి పామర ప్రజల సుఖ, దుఃఖాల్ని, ఆవేశకావేషాల్ని, సందర్భోచితంగా భావస్ఫోరకమై, ఆనందనిష్యందియై ఉండడం గమనించగలం. పై పెచ్చు జానపదుల స్వభావోచితమై, సహజమై, నిసర్గమనోజ్ఞమై ఉండడం ముదావహమైన విషయం. అందుకే ఆ గేయాలు ఏ కాలంలో రచింపబడ్డా, అందులోని భాష అలా ఉన్నా ఈనాటికీ ఏనాటికీ ఆనందాన్నిస్తూనే ఉంటాయని చెప్పడం సాహసం కాదు అంటే ఆలంకారికులు పేర్కొన్న, సార్వకాలికమైన కవితే ఉత్తమమైందన్న సూత్రం దీని విషయంలోను రుజువైంది. అది సహృదయ హృదయైకవేద్యం!

# అన్నమాచార్యుల సంకీర్తనలు –

# భాషా వైభవం

1 అన్నమాచార్యుడు ఒక అసామాన్యుడైన మహామనీషి. అత్యుత్తమ భక్తాగ్రేసరుడు, ప్రథమాంధ్ర వాగ్గేయకారసత్తముడు; అందుకే అన్నమాచార్యునికి "పదకవితా పితామహుడనీ, సంకీర్తనాచార్యుడనీ" బిరుదులు కలగడంలో ఆశ్చర్యం లేదు. ఈ మహానుభావుని మాటల్లో, ఆ మాటల మూటలైన పాటలలో, ఆ పాటల కనుగుణమైన ఆటలో సర్వాంగీణంగా, సముచితంగా భక్తిని రంగరించి రక్తిని మెదపి పాడి, ఆడి తరించాడు; మానవాళికి తరుణోపాయాన్ని చూపించాడు. ఈ పదకవితా రచనారీతిలో, భక్తిమార్గోపదేశ పద్ధతిలో ఆ తరువాతి తెలుగువాగ్గేయకారులైన క్షేత్రయ్య, సారంగపాణి, త్యాగయ్య మొదలైన వారికెందరికో అన్నమాచార్యుని అడుగుజాడలే గురిజాడలు. "ఈతని శృంగార సంకీర్తనాంశము, మున్నూరేండ్లు తరువాత క్షేత్రయ్యగానూ, అధ్యాత్మ సంకీర్తనాంశము అటుతరువాత నూరేండ్లకు త్యాగయ్యగాను నవతరించెనన జెల్లును" – అని ముక్తకంఠంగా ఏనాడో పేర్కొన్న వేటూరి ప్రభాకరశాస్త్రిగారి మాటలు అక్షరాల సత్యం!

1.1 తెలుగు సాహిత్యాన్ని పండిత సాహిత్యమూ, పామర సాహిత్యమూనని స్థూలంగా రెండు విధాలని చెప్పవచ్చు. దీన్నే ప్రౌఢ సాహిత్యమూ, జానపద సాహిత్యమూ అని పేర్కొనవచ్చు. ఇంతకంటే శిష్టసాహిత్యమూ, శిష్టేతర సాహిత్యమూనని చెప్పడం సముచితం. తెలుగు సాహిత్య మాగాణంలోని శిష్టేతర కవితా స్రవంతి మూడు పాయలుగా ప్రవహిస్తూ ఉంది. మొదటి కేవలం జానపద కవిత, దాని పుట్టుక అనాది. రెండోది పాల్కురికి సోమనాథునితో ప్రారంభమైన ద్విపద కవిత, మూడోది అన్నమాచార్యుని వరవాక్కుతో ఆరంభమైన సంకీర్తన కవిత. అన్నమాచార్యుడు భక్తిపరవశుడై ఆడిపాడిన పదాలే అధ్యాత్మ శృంగార సంకీర్తనలు. తెలుగులో శిష్టకవుల పద్య కవితాపీఠం పక్కనే పదకవితకు సరిపీఠం సవదరించి గౌరవం సంపాదించి పెట్టిన ఘనత తాళ్ళపాక అన్నమాచార్యునికే దక్కింది. ఈతని సాహిత్యం అనంతం; అదొక మహోదధి. తన సంకీర్తనల్లో వాడకచేసిన భాషా

వైభవాన్ని కొండని అద్దంలోలాగా—స్థాలీ పులాకన్యాయంగా—చూపించడమే నాయీ వ్యాసమర్పణ పరమ ప్రయోజనం.

## 2.0 కమనీయ కవిత :

పండితులను మాత్రమేకాక పామరప్రజల్ని సైతం రంజింపచేయడం పద కవితల పరమ ప్రయోజనం. సామాన్యప్రజలకు అందుబాటులో ఉండేట్లు, వారి అర్థావగతికి దగ్గరగా ఉండేట్లు సరళమూ, సులభమూ అయిన భాషలో పదకవితల రచన సాగడం ఎంతైనా ముదావహం ఈవిషయంలో అన్నమాచార్యుడు అన్నివిధాలా సఫలీకృతుడైనట్లు అతని సంకీర్తనలే చెబుతాయి.

### 2.1 ఇందుకు చక్కటి ఉదాహరణ

"విరహ మొక్కందమాయ విచ్చేయవయ్యా
నిరతి నాకెజాణ నీవంటా మొక్కితిమి ॥పల్లవి॥

చెక్కిటి చెయ్యే చెలికి శేషపరియంకమాయ
జక్కవ చన్నులు శంఖుచక్రములాయ
వుక్కచెమటే జలధివునికి పేసుకవిన్నుఁ
జక్కని సతిదలఁచి సారూప్యమందె ॥విరహ॥

చలువ కస్తూరిపూత సరినీలవర్ణమాయ
మెలుత నివ్వెర గనిమిషదిష్టాయ
తొలుత చిగురు పాన్పు తులసి పూజాయ నిన్ను
జలజాక్షి తలపోసి సారూప్యమందె ॥విరహ॥

పిరుల గట్టినతాళి శ్రీధర భావమాయ
వరుస వలపు భక్తవత్సలమాయ
యిలపై శ్రీవేంకటేశ యింతలో నీవుగూడఁగా
సరసనిన్నంటె నాకె సారూప్యమందె ॥విరహ॥

(శృంగార సంకీర్తనలు : XXVI–191)

ఇందులో కమనీయ కవిత ఉంది. ఆ కవితకు తగిన చక్కటిభాష ఉంది. విరహవ్యథా భరిత మనస్క అయిన నాయిక సర్వవిధాలా శ్రీ వేంకటేశ్వరునిలాగానే

అయి సారూప్యమందిందట. ఈవిరహం నాయికకు ఒకఅందాన్ని చేకూర్చిందట, ఆ సారూప్యమందిన నాయికనే నాయకుడు శ్రీవేంకటేశ్వరుడే కాబోలునని చెలులు "నిరతి నాకేఁజూచి నీవంటామొక్కితిమి "విచ్చేయవయ్యా"–అని ప్రార్థిస్తున్నట్లు చెప్పారు. ఇందులో వ్యంగ్యం, హాస్యం ప్రస్ఫుటమై సహృదయ హృదయాల్ని ఆనందపరవశుల్ని చేస్తాయి. ఇంతేగాదు. చెలిచెక్కిలిమీది చేయి శేషపర్యంకమైందనీ, జక్కువచన్నులు శంఖచక్రాలయ్యాయనీ, చెమట జలధిఅయ్యిందనీ ఉత్ప్రేక్షించటంలో ప్రతిభాసంపన్నుడైన మహాకవి కుండవలసిన భావుకత, తన్మూలంగా చమత్కారం గోచరించి మన రసానందానికి అవధిలేకుండా చేశాయనడం అత్యుక్తికాదు. ఇలాగే తక్కిన రెండు చరణాల్లోను. ఇలా వివరిస్తూవెళ్ళితే ఎంతైనా చెప్పవచ్చు. ఇందలిభాష సరళం పైగా ఇందు క్రియలు "శేషపరియంకమాయ. శంఖచక్రములాయ" అని వ్యావహారికభాషలోనే ఉండి పుష్టిని తుష్టినీ చేకూర్చాయి. 'ఆమెను' అంటే అంతస్ఫూర్తి వచ్చేదికాదని మనకు తెలుసు.

2.2 "వర్ణనానిపుణః కవిః" అన్నది లాక్షణికోక్తి. దీనికి చక్కటి ఉదాహరణ మీపదం. మన ప్రబంధకవులు అష్టాదశవర్ణనల్లో ప్రధానమైన ఋతువర్ణన పలురకాలుగా చేసి తమ గొప్పదనాన్ని చాటుకొన్న సంగతి మనకందరికీ తెలిసిందే. ఒకే చిన్నపదంలో ఆరు ఋతువుల్ని వర్ణించి వాళ్ళందర్నీ మించిపోయాడు అన్నమాచార్యుడు.

"కాలము లారునుఁ గలిగె నీకువిదె
బాలకి యందే పైపైనీకు ॥పల్లవి॥

పతికొప్పు విరులు జలజలరాలిన
లతల వసంత కాలము నీకు
కతఁగాదన మై కాఁకలుచూపిన
అతివేసవి కాలమప్పుడేనీకు ॥కాలము॥

కాఁగిట చెమటల కడునినుఁదడిపిన
కాఁగల తొలకరి కాలమది
వీఁగని చూపుల వెన్నెలచల్లిన
రాఁగిన మతికి శరత్కాలంబు ॥కాలము॥

లంచపుఁ బులకల లలన నీరతుల
కంచపు హేమంత కాలమది
యెంచఁగ శ్రీవేంకటేశ వలపునతి
వంచ శిశిరకాల వైభవమాయ ॥కాలమ॥

(శృంగార సంకీర్తనములు–XXVI–88)

ఇంత సంక్షిప్తంగా ఆరు ఋతువుల్ని వర్ణనచేసిన పదకవేగాదు, కావ్యకవి సైతం మరొకరులేరంటే అన్నమాచార్యుని గొప్పదనం స్పష్టమవుతుంది.

2 3 ఇంతేగాక

'దశవిధాచరణం తన్నభవతి
దశవిధావస్థాం తేత్ర'

(శృంగార సంకీర్తనలు XII–374) లాంటి కేవలం సంస్కృత భాషలోనే రచించిన పదాలూ,

'ఎడయాట మాటల నేచినవలపు
వొడమిన యాసల వొద్దొకవలపు'

(శృంగార సంకీర్తనలు–XII–350)

మొదలైన చక్కటి తేటతెనుగులో రచించినపదాలు అన్నమాచార్యుని సాహిత్యంలో ఉన్నాయి. వీనివల్ల అన్నమాచార్యుని ఉభయ భాషాపాండిత్య ప్రకర్షమనకు అవగతమవుతుంది.

2.4 ఏదియేమైన అన్నమాచార్యుని సంకీర్తనల్లోని భాష సామాన్యప్రజల భాష అనడంలో సందేహంలేదు. ఇందుకు ఓ ఉదాహరణ.

కాలమెల్లా మోసపోవు(ము)? కానియ్యరా కల
కాలమెల్లా జరపేవు కానియ్యరా ॥పల్లవి॥

ఎడపుల జవ్వనపు టింతినొకతెఁ గూడి
కడలనే తిరిగేవు కానియ్యరా
మెడగట్టుకొకతెకు మేలువాఁడవై నీవు
కడన బొంకేవు నాతో కానియ్యరా ॥కాల॥

బంగారుమెఱుఁగు చాయపడఁతి నొకతెగూడి
కంగనాడేవు నాతో కానియ్యరా
అంగననొకతె వెనకమరదాఁచుకొని చొ
క్కంగఁజేసి ముద్దాడేవు కానియ్యరా ॥కాల॥

సంపద గలాపెఁగూడి సరసములాడుచు
కంపులే పూసేవు కానియ్యరా
వెంపరలాడుచు నీవెంట నొకతెరాఁగా
కంపించక వేంకటేశ కానియ్యరా

(శృంగార సంకీర్తనలు XII-51)

ఇందులో నాయిక శ్రీ వేంకటేశ్వరుని దక్షిణ నాయకత్వాన్ని నిందిస్తూంది. ఇందులోని భాష సర్వసామాన్యమై ఒప్పుతుంది

3.0 అన్నమాచార్యుని సంకీర్తనల్లోని భాషలో ప్రత్యేకతఉంది. ఏఒక్క పదం మనం చదివినా ఈవిషయం మనకు స్పష్టమవుతుంది. అన్నమాచార్యుని భాషాప్రత్యేకత అవగతమవుతుంది. అయా ప్రత్యేకతల్ని క్రమంగా పరిశీలిద్దాం.

3 1 తరచు ప్రయోగించే పదాలు, పదపంధాలు :

3 1.1 సంబోధనలలో_'ఆర' బదులు_అల : అమ్మలాల (XII-32), కాంతలాల (XII_42)- తమ్ములాల, అన్నలాల; తల్లులాల, కొమ్మలాల, అమ్మలాల, అక్కలాల (XII_99) తొయ్యలులాల (XXII-172) తరుణులాల (XXII -273), పొలతులాల (XXII-273) నాతులాల, పడతులాల (XXII-38)

3 1.2 కొన్నిపదాలు, పదబంధాలు :

అద్దిగో (XII-14), ఇద్దిగో (XII-19,44), అల్లదిగో (XXII-134), అద్దో (XXV-467) దేవులమ్మ (XII-8), ఉద్దండాన (III-563), ఉద్దండీడవు (XXII-2), అగడీడవు (XXV-12) నాటకీడవు (XXV-474) వెంగేలు (XXII-1, 4), యేకతానకు (XXII-3), కమ్మటిదాన (XXII-40), తారుకానా లెల్ల (XXII-33), మాడిగెపువారము (XXII-37), వుందానను (XXII-38), విందానను (విన్నదానను) (XXVI-128), మోవివందు (XXII-81), మోనము (XXII-149), మంచితావకాడవు (XXII-219), నిచ్చనిచ్చ (XXII-440)

ఆనోదాన (XXII-528), ఆనోదకాడవు (XXII-558), ఎంతయాశోదక తైవే (XXIV-13), జాణకతై (XXV-25), తట్టుపుణుగు (XXV-91), విదేలు (XXIV-226), కుందణము (XXIV-422), లచ్చైనలు (XXIV-496), పేనాసేనా (II-48), ఆతుమ (ఆత్మ) (II-242), అచ్చుత (II-242), బాయట (X-184).

### 3.1.3 కొన్ని క్రియాపదాలు :

గుంపించెనా (XXVI-1), కాగిలించు (XXII-1, 4, 8), ఆముకొన్న (XXII-19), ఆడుతాను, చల్లుతాను (XII-6), వచ్చితేను (XXII-14), దగ్గిరితే (దగ్గరికి వస్తే) (XXII-502), మోహము గత్తే (గలిగితే) (XXVI-44), కూరిమి గలితే (గలిగితే) (XXVI-93); ఆసగలే (గలిగితే) (XXVI-127), ఆడకువే, చల్లకువే, కసరకువే (XXII-409), వినేరు, దాచేరు, నోరూరేరు, కూడేరు (XXV-32).

ఇలాగే ఇంకా ఎన్నో పదాలు తరచుగా తన సాహిత్యమంతటా ప్రయోగిందాడు అన్నమాచార్యుడు

### 3.2 పలుకుబళ్లు :

పలుకుబళ్ళు, నుడికారాలు, జాతీయాలు, సామెతలు అన్నవి ఏ భాషకైనా ప్రముఖమైన అంశాలు. వీటిమీదనే ఆ భాషావైశిష్ట్యం ఆధారపడి ఉంటుంది. అలాంటి చక్కటి పలుకుబళ్ళను ప్రయోగించిన రచయితకు ఆ భాషపై గల అధికారాన్ని ప్రస్ఫుటం చేస్తుంది. అన్నమాచార్యుడు తన సంకీర్తనల్లో ప్రయోగించిన పలుకుబళ్ళను పరికిస్తే ఆతనికి తెలుగు భాషాస్వభావం ఎంతగా తెలుసునో స్పష్టమవుతుంది. కొన్ని ఉదాహరణలు.

అంగడి బెట్టు (III-108), ఇంటిలోని పోరు (XII-199), ఒడిగట్టుకొన్నందుకు (XXV-160), కన్నుల పండుగ (XXVI-308), కనులెల్లా యెఱ్ఱవాయె (III-604), కన్ను వేసినాడు (III-66); కాయో పండో (XII-341), కాసుసేయవి (III-633), తెగిన గాలిపడగవై (III-563), పలచనై తిమి (XII-364), రాతిగుండె (XII-9), రొమ్ముననే కుంపటియైతే (III-181), సంతల బెట్టి

తివి (XXV-271), సూదివెంట దారమై (III-139) ఇలాగా ఎన్నైనా ఉదాహరించవచ్చు.

3.3 సామెతలు :

రసగ్రహణ పారీణులైన పాఠకుల మనఃపుష్టికి సాహిత్యంలోని సామెతలు చక్కటి ఆమెతలు; పైపెచ్చు ఆకవికి భాషపైగల అధికారాన్ని పట్టిఇవ్వగలవు. కొన్ని చక్కటి సామెతలు.

అమ్మోటి దొకటియు వసిమిలేని దొకటి (XXII-327)
ఊరుదీయఁ బేనుపచ్చినక నేలమాటలు (XII-111)
కాంతుని నీమొలఁ గుచ్చి కట్టుకొనఁగదవే (XXIV-525)
కుట్టిచూడ దోసపిండ (III-204)
గోర బొయ్యేదానికి గా గొడ్డలేల (XXII-124)
గోరుచుట్టుపై రోకటి పోటాయ గదమ్మ (XII-238)
జలజాక్షి మోవితేనె చందమామ గుటకలు (XXII-77)
పిలువని పేరటమై పిరిగొన వేడుక (XXIV-276)
పూచిన తంగేడువలె పొదలీ మా వలపు (XXII-511)
వడిగొన్న కానవేని వఱదలు గలవా (XXVI-330)
శిరసుండ మోకాల శేషయేటికే (XXV-441)

ఇలాంటి సామెతలు అన్నమాచార్యుని సంకీర్తనలన్నిటా కోకోల్లలు. పైగా అవి సందర్భోచితమై సహృదయులని సంతసింప జేస్తూంటాయి.

3.4 సంధి : సలక్షణమైన సంధికార్యం అన్నమాచార్యుని సంకీర్తనలన్నిటా ఉంది. అయితే అపురూపమైన సంధికార్యాలు ఎడనెడ కనిపిస్తాయి

3.4.1 క్త్వార్థకేకార సంధులు : సర్వ సామాన్యమే. అకుమడ చిచ్చేటి (XXII-263), కలసిమెలసుండగా (XXIV-13), కూడుండేము (XXII-71), చెల్లుండగా (XXII-112), పవ్వళించుఁడగా (XXII-21).

3.4.2 విచిత్రమైన సంధి :

అపెలిగితే < అపె+అలిగితే (XXII-274)

ఎవ్వతెకో < ఎవ్వతె+ఒకో (XXV-82)

చెప్పంపే మాటలు < చెప్పి+అంపేమాటలు (XXII-284)

పెట్టెంపనో < పెట్టి+అంపెనో (XXIV-66)

సిగ్గువ డెల్లంత < సిగ్గువడి+అల్లంత (XXIV-523)

3.4.3 త్రికసంధిలాంటి సంధి :

ఒబ్బుద్ధి < ఓ+బుద్ధి < ఒక+బుద్ధి (XXIV-528)

నియ్యాన < నీ+యాన < నీ+అన (XXV-488)

నియ్యిచ్చ < నీ+యిచ్చ < నీ+ఇచ్చ (XXV-497)

3.4.4. ద్రుతం మీద యడాగమం :

చలము యెందాకా (XXV-19)

వరాకు నీకు యేమి పేపేవు (XXII-509)

సుద్దులు యడుగ వలెనా (XXII-494)

3 4 5 యడాగమం రాలేదు సంధి కలుగలేదు

వెలఇంచ వచ్చునా (XXV-320), నా ఇంపుసొంపులు (XXV-476)

3 4 6. యడాగమానికి బదులు 'వ'దాగమం.

మరచి వూరుకుండితే (XXIV-189)

3 4 7. దీర్ఘమున్నా ద్రుతకార్యం

నీవూఁ జుట్టము వౌదువు (XXIV-241)

కేవలం విలక్షణమైన సంధులు కొన్నింటిని మాత్రమే ఇచట దిక్ప్రదర్శనంగా చూపించడం జరిగింది.

3 5 సమాసాలు :

సలక్షణమైన సమాసాలు అన్నమాచార్యుల సంకీర్తనల్లో సామాన్యమే. అయితే చాలవరకు ఈ సమాస కల్పనలో ఐహూరీతుల వోయినట్లు స్పష్టమవుతుంది పరిశీలనవల్ల. విలక్షణమూ, అపురూపమూ అయిన సమాసాలను చూద్దాం.

3.5.1 తెలుగులో చక్కటి సమాసాలు :

చెందమ్మి పూవుదండలు (XXV_136)

నిలువుఁ గొలువులెల్లా (XXIV_328)

పెక్కు పనులవాఁడవు (XXIV_3)

మొగమిచ్చ చెలులము (XXII_38

వాడు మోవి (XXIV_12), సందడి కొలువు (XXIV_3)

3.5 2 వైరి సమాసాలు :

వైరి సమాసాల్ని చాలా విరివిగా అన్నమాచార్యుడు ప్రయోగించాడు. మచ్చుకు కొన్ని –

అతివేడుక (XXVI_298), అనేక వంతగాడవు (XXIV_136) ఘనజవ్వనము (XXVI_262), జవ్వనమదములు (XXIV_372, తననిజబాసలు (XXII_266), నానాజాతివండ్లు (XXV_91), నానాసొమ్ములు (III_125), ప్రాణప్రాణనేస్తమైనచోట (XXVI_241) ప్రేమజవ్వనమదపు పెండ్లికొడుకవు (XXII_548) ఖారీతనము (III_197), సురతచిన్నెలు (XXIV_243)

3.5.3 విలక్షణ సమాసాలు :

కంచపుమోవి (మోవికంచము) (XXVI_414)

కూపనరకమున (నరకకూపమున) (II_3)

పండుమోవితేనె (మోవిపండుతేనె) (XXVI_79)

పడగవాతెరయెత్తి (వాతెరపడగయెత్తి) (XXV_550)

3.5.4 వింతగా మరోరీతిని సమాసాలు కల్పించడం చూడవచ్చు. వీటిలో సంబంధవాచకాన్ని పదబంధమధ్యంలో ఉంచడం వీటిలోని విశేషం.

తుమ్మిదల బెదరనిగుంపులు (బెదరని తుమ్మెదలగుంపులు) (XXIV-239)

దొంతుల నాయాసలకు (నాయాసల దొంతులకు) (XXV-447)

మెచ్చితి నిన్నప్పటి మేలుమేలు (అప్పటి నిన్ను మెచ్చితి మేలుమేలు) (XXVI-570)

రెప్పలనీలోని చూపే (నీరెప్పలలోని చూపే) (XXV-373)

విమలపు నీపతిని (నీ విమలపతిని) (XXVI-36)

3.6 విభక్తులు :

ప్రథమకు బదులు (షష్ఠి) :

కూరిమితో మీకుమీకె కొలిచేవారా (మీకుమీరే) (II-167)

మనరాదు నీకింకపముంగావలెను (నీవింక) (II-365)

ద్వితీయకు బదులు షష్ఠి :

ఇంతికి నీవువలచు టిందరము నెఱుంగుదుము (ఇంతిని) (XXII-22)

ద్వితీయకు బదులు తృతీయ :

చేసుకోవయ్య పెండ్లి చెలితోను (చెలిని) (XXII-513)

తృతీయకు బదులు ద్వితీయ :

అంకెలలూడుచే మేలు యీ

కింకరులను నలంగెడికంటెను (కింకరులచేత) (II-186)

ఇలాగే తక్కిన విభక్తులకు సైతం ఉదాహరణలివ్వవచ్చు.

4.0 రాయలసీమ మాండలికాలు

4.1 పదాలు : అప్పా (తండ్రీ) (II-11)

అసిమి (అమ్మెటి దొకటియు నసిమిలోనిదొకటి) (XX I-327)

ఒడ్డారాలు (ఒయ్యారము) (XXIV-170)

ఒప్పిదిగా (నిశ్చింతగా, హాయిగా, ప్రత్యేకంగా) (XXIV–278)

కణకాలు (పాతరలు) (XXIV–235)

కిమ్ముల (కిమ్ముళ్ళ-రహస్యంగా) (XXII–220)

మరవలు (చెరువుల మరవలు) ( 47)

విగ్గ (విర్రగా–గట్టిగా–'a' ఉచ్చారణ) (XXIV–489)
(సారంగపాణి విగ్గుకయ్యవద్దు–194)

మంకు (మూర్ఖత్వం) (XXIV–445)
(మంకు : "మంటిలోనదాచు మంకుజీవి" 22–148)

నరకా (నరాకా–తమాషా) (XII314)

పైకమే (సన్నని, సూక్ష్మం, ఇంకా తేలిక, చులకన అనిగూడా) (XII- 304)

4.2 . పదబంధాలు :

ఆపోసనము (XXII—198)

ఉద్దువుద్దులై (జతలుజతలై) (II-74)

[ఇలాంటిదే వేమన ప్రయోగం ఉద్ది (గూడి)
"ఒద్దిగూడి బ్రతుకు చంద్రుడువేమ" (140–67)]

నెల్లిచెట్లు (ఉసిరికచెట్లు) (XXV–435)

4.3 క్రియాపదాలు :

అగద్రైతిమి (పంచనైతిమి, నిందమోస్తిమి (XXVI–271)

ఎగబోసి (సన్నులయెగబోసి) (XXV–368)

క్షేత్రయ్య–ఏమేమో విభునితో ఎగబోసితే–స్వ–98)

ఏకారేవు (XXV–34)

చౌకళించి (తప్పించి) (XXIV–138)

పంగిరించు (ప్రత్తిపోడుదు) (XXII-120)
వెంపరలాడు (ఆత్రంగా వెదకు) (XII-51)

4 4 వాక్యాలు :

అకుమడచిచ్చెను (తమలపాకులు చిలుకలు కట్టిఇచ్చెను) (III-187)
ఉపద్రారాదుకదే (ఉపద్రవం) (III-150)
ఎగదిగపోతలైతే నేడచాచ్చేదే (XXVI-271)
నీవుగన ఆదరించితే (XXV-256)
పూచుకునే మాటాడితి (XXII-544)
ముయికి ముయాయే (III-203) ("ముయ్యికిముయ్యి ఆయితు"–
పురందరదాసు).

పేసరుకోకురే (XXVI-113)

4 5 పై పరిశీలనవల్ల అన్నమాచార్యుని సంకీర్తనల్లోని రాయలసీమ మాండలిక పదజాలం, దాని స్వరూపస్వభావాలు, సూక్ష్మాతిసూక్ష్మమైన అర్థభేదాలు మొదలైన అంశాలన్నీ మనకు స్పష్టమవుతాయి. దీనికి అనుబంధంగా మరికొన్ని అంశాలు పైతట్టు మనమిక్కడ పరిశీలించడం అవసరం. వింత ప్రయోగాలు, అన్యదేశ్యాల్ని గూర్చి స్థూలంగా చూద్దాం.

5 0 వింత ప్రయోగాలు :

అన్నమాచార్యుని సంకీర్తనల్లోని ధ్వనులలో, పదాల్లో, పదబంధాల్లో, క్రియల్లో వాక్యాల్లో, ఈ విశిష్ట వింతలు మనకు గోచరిస్తాం.

5.1. ధ్వనుల మార్పులు :

5.1.1 'గ'కు బదులు 'వ' అదివో (<అదిగో) (XII-14)
అల్లదివో (<అల్లదిగో) (XXII-134)
ఇదివో (<ఇదిగో) (XII-19,44)
పుట్టుగు (<పుట్టువు) (II-175)

5.1.2 'జ'కు బదులు 'చ' :

చింక చందురుడు (< జింక చందురుడు) (XII-26[illegible])

చింకచూపులది (< జింక చూపులది) (XXIV-166)

చింక బెదురులాడి (< జింక బెదురులాడి) (XII-261)

'జ'కు బదులు 'స' :

సింకసూపు నాపై సూవదుగా (< జింక) (XII-370)

5.1.3 'ట'కు బదులు 'త' :

తక్కులుమాను (< టక్కులుమాను) (XII-257)

తెంకి (< టెంకి) (XXVI-27)

తక్కరి (< టక్కరి) (XXVI-27)

తక్కరీడు (< టక్కరీడు) (XXV-104)

నగుతగాక (< నగుటగాక) (XXV-213)

దూరతగాక (< దూరుటగాక) (XXV-461)

జోడా తెరుగువా (< జోడా టెరుగవా) (XXV-323)

ఎక్కుదౌతా (< ఎక్కుదౌటా) (XXV-2)

5.1.4 'డ'కు బదులు 'ర|ఱ' :

జరసేరా (< జడసేరా) (XXV-188), (జఱయుచు (< జడియుచు) (XXV-199)

5.1.5 'ద'కు బదులు 'త' :

తిట్టమై (< దిట్టమై) (IX-64)

5.1.7 'న'కు బదులు 'ణ' :

తట్టుపుణుగు (< తట్టుపునుగు) (XII-198)

కుందణము (< కుందనము) (XXIV-422)

అయిరాణి (< అయిరేని) (XXI-189)

యోగిణి (<యోగిని) (XXII-537)

'న'కు బదులు 'ర' :

చిరుకులు (<చినుకులు) (XXIV-73)

5.1.2 "హ్రస్వానికి" బదులు "దీర్ఘం" :

తో(గిచూచి (<తొంగిచూచి) (XXIV-73)

పానివట్టి (<పనివట్టి) (XXV-265)

బాయిటవేయగనేల (<బయటవేయగవేల) (XXV-282)

5.1.9 "దీర్ఘం" మీద "పూర్ణానుస్వారం" :

ఏంటిమాటలు (ఏ(టిమాటలు) (III-223)

గాంటపు (<గాటపు) (III-214)

పైండి (<పైడి) (III-585)

5.1.10 అద్విరుక్తత :

నీసుదులెల్ల (<నీ సుద్దులెల్ల) (III-514)

ముగురెరిగిన (<ముగ్గురెరిగిన) (XXIV-507)

పూనిపటి (<పూనిపట్టి) (XXVI-89)

మక్కువచలితి (<మక్కుచల్లితి) (XXVI-90)

పానిపటి (<పానిపట్టి) (XXVI-221)

మువ్వరివిటూర్పు (మువ్వరివిట్టూర్పు) (XXVI-203)

5.1.11 లేని ద్విరుక్తత :

అద్దలింపుచు (<అదలింపుచు) (XII-242)

అద్దలించి (<అదలించి) (III-115)

అద్దరిపాటుండగాను (<అదరిపాటుండగాను) (XXVI-176)

5.1.12 అక్షరలోపం :

దాకొన (<దాగికొని) (XXV-32)

చిత్తరున (<చిత్తరువున) XXV-330)

తనుపై జేయివేసి (<తనువుపై జేయివేసి) XXVI-75)

తిరుగుకంటె (<తిరుగుటకంటె) (II-3)

మోహముగల్తే (<మోహముగలిగితే) (XXVI-44)

5 2 పదాలు :

ఘనురాలు (XXV-26), జాణడు (XII-201)

నావొళ్ళ (నావల్ల) (II-4), భ్రమత (భ్రమ) (XXII-277)

సంగతాలు (స్నేహితులు, సంగాతో ఒరియా భాషలో) (XXIV-119)

భాగ్యమంతులు (భాగ్యవంతులు) (XXIV-399)

లేసుగా (లెస్సగా) (XXV-33)

సంతము (సొంతము) (XXV-119)

5.3 పదబంధాలు :

ఊడిగమాపె (దాసి, పనిమనిషి, పనికత్తె) (XXII-5)

జంపులసిగ్గులు (జంపు-పొడవు-సిగ్గులయొక్క జంపులు) (XXII-544)
(జంపుస్సిచనులు (XXIV-190)

సిగ్గిరిపెండ్లికొడుకు<br>సిగ్గిరి పెండ్లికూతురు } (XXIV-76)

అంటురాయి (అయస్కాంతం) (XXIV-20)

వాలుకచూపులు (వాలుచూపులు) (XXII-478)

పొరుగిరుగువారు (ఇరుగుపొరుగువారు) (XXIV-373)

పూతసిగ్గు (XIV-561)

ఊత చెక్కుచేతలతో (XXIV-561)

5.4 క్రియాపదాలు :

అసలాసలు పుట్టించు (మిక్కిలి ఆశపుట్టించు) (XXIV-50)

యాలదగ్గరేవు (ఎందుకు దగ్గరకువస్తావు) (XII-69)

ఆతదెవ్వరౌతా (అతడు నాకేమవుతాడు) (XII-69)

గయ్యాళించు (గయ్యాళిమీద ఇంచుక్క) (XXIV-342)

సోకింపించి (సోకించి-ప్రేరణరహితంగా) (XXV-205)

నవ్వింపించి (నవ్వించి ,, ) (XXV-208)

ఈదింపించరాదా (ఈదించరాదా ప్రేరణరహితంగా) (XXV-205)

5.4 వాక్యాలు :

అక్కరగలనీవు (అక్కరకలిగిననీవు) (XXIV-443)

చేసినదోసము వాసు (చేసినదోషము వాయు) (XXII-2)

సిగ్గువడకువయ్య (సిగ్గుపడకుమయ్య) (XXII-3)

నిజమీయవయ్య (నిజం చెప్పవయ్య) (XXII-2)

పారనేలవేసేవు (ఏలపారేసేవు) (xxii-192)

దయగలడాతడు (అతడు దయగలవాడు) (xxii 217)

ఆపెప్పై బత్తిగలవు (ఆపెప్పై బత్తిగలవాడవు) (xxii-423)

నీచక్రము అతిప్రతాపి (నీచక్రము అతిప్రతాపముగలది) (xxiv-246)

నీపాదములు గుద్దగరాదా (నీపాదములు పట్టగ [పిసుగగ] రాదా) (xxiv-280)

పాయప్పుమదాన నన్నేపలుకరాదా (పలుకరించరాదా) (xxv-5)

మనసేల కరగవురా (నీమనసేల కరగదురా) (xxvi-90)

ఇలాగా వివిధవిధాల విలక్షప్రయోగాలు చేయడం అన్నమాచార్యుని స్వాతంత్ర్యాన్ని, గడుసుదనాన్ని, అంతకంటే పదకవితా పితామహునిగా ఆతనికి భాషపై గల అధికారాన్ని స్పష్టంచేస్తున్నాయి.

6.0 అన్యదేశ్యాలు :

అరబ్బీ, ఉర్దూ, హిందీ, కన్నడం, తమిళం, మొదలైన అన్యదేశాలు సైతం అన్నమయ్య సాహిత్యంలో కనిపిస్తాయి.

6.1 అరబ్బీ, హిందీ ఉర్దూపదాలు } జగడాలు (xii-8), జగడించె (xii-36) బాపురే (xii 147. 115).

పెళాసందురశె (xii-153), జూటరి (xxiv 173): జూటు (xxiv-230), కుశ్యాయి (xxiv-521), కబురులే (ii-123), ఫౌజులు (x-2·1).

6.2 కన్నడ పదాలు :

బెళకికేపొద్దు, (xxiv-280), బెళకు (ii-173), బెళక (xxii-363), అప్పణి (య్యాజాలవలెగా) (xxii 227), అప్పణ (నీకిచ్చెనో) (xxii-390), (నీ) అప్పణ(చేత) (xxiv-256)

6.3 తమిళపదాలు : ఉడయవరులో (ii 229), తిరుమంత్రము (ix-242), తిరువాముడి (ix-195), (పేనా మొదలారివద్ద (ix-222), తిరుమణి (x-245), పల్లాండుపల్లాండు, పెరుమాళ్ళు (x 132), తిరువేంగళప్పడు (xxii-345) విణ్ణప (జీవారు) (xxiv-281), అళగిరి (xxv 457)

ఇలాగా ఆనాడు ప్రచారములో ఉన్న అన్యదేశాల్ని సైతం అన్నమాచార్యుని సంకీర్తనల్లో చోటుచేసుకొన్నాయంటే భాషమీద అన్నమాచార్యునికి అధికారమూ, ఆనాటి అన్యభాషాదరణమూ స్పష్టమవుతాయి.

7.0 ఇది కేవలం అన్నమాచార్యుని సంకీర్తనల్లోని మాండలిక పద ప్రయోగానికి సంబంధించిన దిఙ్మాత్ర ప్రదర్శనమాత్రమే. ఇంకా లోతుగా పరిశీలించి సూక్ష్మాతిసూక్ష్మంగానైనా అన్నమాచార్యుని మాండలిక పదప్రయోగాన్ని గూర్చి పరిశోధన చేయవలసిన అవసరమెంతైనా ఉంది. దానివల్ల అన్నమాచార్యుని హృదయావిష్కరణకు సంబధించిన తీరుతెన్నులను స్పష్టం చేయడమేగాక కొంతవరకైనా మనం ఋణవిముక్తులం కాగలమని భావిస్తాను. అందుకై పరిశోధకులు ప్రయత్నిస్తారని, వారికితోడ్పడికసాయం తిరుమల తిరుపతి దేవస్థానంవారు చేస్తారని ఆశిస్తున్నాను.

# అన్నమాచార్యుల సంకీర్తనలు – రాయలసీమ మాండలిక పద ప్రయోగం

1.0 సర్వాంధ్రకవుల్లాగే చక్కటి తెలుగుభాషనే అన్నమాచార్యుడు గ్రహించినా ప్రత్యేకించి ఆతడు రాయలసీమ కడప మండలంలో పుట్టిపెరిగి టంగుటూరు, పెనుగొండ, విజయనగరం, అహోబిళం మొదలైనచోట్ల తిరిగిచూసి, తిరుమలలో శ్రీవేంకటేశ్వరుని సన్నిధిలోనే నివాసం ఏర్పరచుకొని జీవితాంతం పదరచనచేస్తూ భగవత్కైంకర్యం చేస్తూవచ్చిన వాడు గనుక ఆతనిభాష ప్రధానంగా రాయలసీమలో ఈనాడూ వాడుకలోఉంటూ జీవిస్తున్నభాష. ఆ మాండలికాల్ని పరిశీలిస్తే ఆనాటి రాయలసీమకీ, ఈనాటికీ పెద్ద తేడాలేదనిపిస్తుంది

ఈ సందర్భంలో తెలుగుభాషలోని మాండలికాల్నిగూర్చి తెలుసుకోవడం అసమంజసమేమీకాదు, తెలుగు గ్రాంధికభాషలో అట్టే తేడాలులేకున్నా వ్యావహారిక భాషలో అనేకభేదాలున్నాయి. అందులో ప్రధానంగా మూడు మాండలికాలు అందరకు సుపరిచితమే. అవి రాయలసీమ, తెలంగాణా, కోస్తాప్రాంతాలకు సంబంధించిన మూడు మాండలికాలు. సూక్ష్మంగా పరిశీలిస్తే రాయలసీమలోని చిత్తూరుజిల్లా మాండలికంలో తమిళప్రభావమూ, అనంతపురం జిల్లావారి వాడుకలో కన్నడభాషా ప్రభావమూ, తెలంగాణాలో ప్రధానంగా ఉర్దూభాషా ప్రభావమూ, ఆదిలాబాద్, నిజామాబాద్ జిల్లాలవారి మాటల్లో మరాఠీభాషా ప్రభావమూ, కళింగాంధ్రప్రజల్లో ఒరియాభాషా ప్రభావమూ కనిపిస్తూఉంటుంది కోస్తాజిల్లాలలో కృష్ణా, గుంటూరుజిల్లాల వాడుకకూ, ఉభయగోదావరుల వ్యవహారానికీ, విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలో మాట్లాడేభాషకూ, ఉచ్చారణలో, ఊనికలో తేడాలుండటం మనకందరికీ తెలిసిందే ఈజిల్లాల్లో సాంస్కృతికంగా, రాజకీయంగా, వ్యాపారరీత్యా భాషలో మహావేగంతో మార్పువచ్చింది రాయలసీమలో ఈవేగం లేకపోవడంవల్ల పూర్వాపూర్వరూపాలే నిలచిపోయి ఈనాడు వినిపిస్తూఉంటాయి.

2.1 రాయలసీమలోని వాడుకకు కోస్తావ్యవహారానికీ ఈనాటికీ కొన్నితేడాలున్నాయి. ఇలాగే రాయలసీమ, కోస్తా, తెలంగాణా ప్రాంతాల్లోని వాడుకల్లో

తేడాలున్నాయి. ఇందుకు ఎన్ని ఉదాహరణలనైనా చూపించవచ్చు. దీనికి తోడు ఊనిక, ఉచ్చారణ మొదలైన వాటిలోని యాసవల్ల గూడా తేడాలు గోచరించవచ్చు. వీటినే మనం మాండలిక భేదాలంటాము ఇలాగా రాయలసీమకూ, తదితర ప్రాంతాలకూ ఉన్న భేదం మనకు స్పష్టమవుతుంది అంటే అన్నమాచార్యుడు రాయలసీమ వాసి గనుక ఆతని సాహిత్యంలో రాయలసీమ మాండలిక పదప్రయోగం ఎక్కువగా కనిపించడం అసహజమేమీ కాదు.

3.0 అన్నమాచార్య సంకీర్తనల్లోని రాయలసీమ మాండలిక పదజాలాన్నంతటినీ అధ్యయన సౌలభ్యం కోసం పదాలు, పదబంధాలు, క్రియాపదాలు అని వర్గీకరించడం జరిగింది. వాటిని క్రమంగా పరిశీలిద్దాం.

3.1 పదాలు :

అద్దో : (అదిగో అన్నపదం అద్దో అని ప్రయోగం)

'కాద్దెరిది నీవుండితే కోపగించునా యాపె
అద్దో నీవింతలోనె మా రలుగగకెల్లునా' (xxii-269)

అప్పా : [తండ్రిని 'అప్ప' అనడం, గౌరవార్థంలో ప్రయోగించడం రాయలసీమ వాడుక].

'అప్పావేఁ దొల్లి అజ్ఞానానైనది
తప్పానేదు గావ తగదా నన్ను (ii-11)

అసిమి : [దీన్నే అసిపి అని అంటారు. పొడుగాటి సంచి, నడుమ తెరువ డానికి వీలుంటుంది. అటుఇటు సరుకులు వేసి భుజంమీద వేసుకొని వెళ్ళటానికి వీలుగా ఉంటుంది].

'అమ్మేదొకటియు నసిమిలోని దొకటి
యిమ్మల నీయందే కంటిమిదివో దిష్టాంతము' (xxii-327)

ఇల్లటము : [ఇల్లరికం]

6]

'చల్లని చూపుల సతికి వలచిపోయి
యిల్లట మున్నవాఁడీతఁడు' (xii-296)

ఉపద్ర : (ఉపద్రవం)

'కతకారి నిన్నుంజూచి కడుంజలము లెక్కువను
పతిభక్తి సేయంగ ఉపద్ర రాదుగదవే (iii-10)

ఎగదిగ : (కిందికి పైకి, తత్తరపాటు)

'మొగమును జూచేవు మోనానఁ దలవంచవు
ఎగదిగ పోతలైతే నేడ జొచ్చేదే (xvii-271)

ఎగనక్కాలు : (ఎగతాళి)

'ఈడ మాతో నింతయేల యెగనక్కాలు
వేడుకకాఁడవు నీవు వేసాలు మావరా' (xxvi-246)

ఒడ్డారాలు : [ఒయ్యారాలు, ఏమొడ్డారం పడతావే అన్నది ప్రయోగం]

'యీడ వి న్నలమేల్మంగ తోడఁ గూరుతుముగాక
వూడిగపు వారికేల వొడ్డారాలు (xxvi-170)

ఒబ్బిడిగా : (నిశ్చింతగా, హాయిగా, ప్రత్యేకంగా, ఒబ్బిడిగా తవమరిగింది. మందిలో కలిసుంటుందా ?)

'వొబ్బిడిగా నాయింటనే వుండితేనే చాలదా
గుబ్బల గర్వము నిన్నుఁ గూడిందీఁ గాక (xxiv-278)

కణజాలు : (పాతరలు)

'అప్పై తలవంచఁగానే అనమాటలాడితివి
వెట్టుకొన్న కణజాల నిండెవలపు' (xxvi-235)

కణజాలు పదప్రయోగం సారంగపాణి పైతం చేసిఉండడం గమనించదగ్గ అంశం.

"పడతిరో వూరూరా పైరు పచ్చలాయె
కదలేని ధాన్యాల కణజాలయె" (సారంగపాణి పదములు-83)

కిమ్మెల : (కిమ్మెళ్ళె _ రహస్యంగా)

'కిమ్మెళిఁ దానన్నీ నెరిగీ వనివున్నదాన
తెమ్మెలి తరులవలె నెచ్చరించను' (xxii-220)

కుదువ : (తాకట్టు).

'వాడికె యింతికి కుదువుగా నన్నుండుమనేవు
కూడి వాని విడిపించు కొనవశమా' (iii-631)

'కుదువ' పదాన్ని వేమన ప్రయోగించాడు.
అర్థవ భు క్తిచేత మొదటి సొమ్ముకు హాని
కుదువ సొమ్ముకెన్న కొంత హాని
మొదటి పక్షమునను మూలక రకు హాని ॥విశ్వ॥
(వేమన పద్యాలు పుట 103, పద్యం 280)

కూరాకు : (ఆకుకూర)*

'చెల్లఁగి కూరాకుఁగాఁ జేసేవు నీ
తలమీద నుండే తరుణిఁ బో నేను (xii-194)

గన : (కనుక, కాని)

'పేనవెట్టిన చెలికి పేసిన వెల్లా పేత
ఆస బుచ్చిన నీవుగన ఆదరించితే (xxv-256)

గబ్బు : (మాలిన్యము, కల్మషము, కంపు, పనికిమాలిన)

'గక్కనఁ గాఁగలించగా గబ్బిదియా నేనంటా
వొక్కపై పోవరిలో నున్నది చెలి'

గులుగు : (కామవాంఛ)

'కొంలనిక నీకు గోవిందుడా ! మము
గులుగు రేచకుపోయి గోవిందుడా' (xxvi-3)

జంపు : (పొందవు)

'యీవేళ నిన్నితడేలె యిచ్చకము శాయవే
పూవుల పేటులాడ జంపుల పిగ్గులేల (xii-544)

నిండా : (పూర్తి, ఎక్కువ)

'నీ కొలువు సేసితిమి నిండాఁ దనిసితిమి
చేకొని నీవారమని చెప్పేమయ్యా' (xxii-194)

నిమ్మలాన : (నిశ్చింతగా)

'ఆదరించి శ్రీవేంకటాధిప నన్నేలితివి
నీదయతో నాపెమూచి నిమ్మలాన నుండెను (xxii-45)

పట్నాలు : (పొట్లాలు)

'చెప్పనేల నీసుద్దులు చెల్లుబడై వుండఁగాను
కప్పిన పట్నాలువారు గందమిత్తురా' (xxvi-485)

పై : (ఒళ్ళు)

'పన్నీరు వసంతాలు పై చీరలు చూపిచ్చే
చెన్నుమీర సాకిరేల చెప్పించేనే' (xxiv-374)

బియకారాలు (విలాసాలు, మోసాలు, బియకారి_విలాసవతి, మోసగత్తె)

ఇచ్చట శ్రీవేంకటేశ యేలితివి నన్నునిట్టె
యిచ్చకపు బియకారా లెన్ని పేసేవిపుడు' (xxiv-414)

బిగ్గె : (బిగ్గరగా, బిర్రగా, గట్టిగా, 'ఎ' ఉచ్చారణ)

"కందువతోఁ జన్నులంటి కదుబిగ్గెఁగాఁ గిలించి
సందడి మర్మములంటి చల్లీ మార్పులు" (xxiv-489)

ఈ ప్రయోగం సారంగపాణి సైతంచేశాడు.

"చెయ్యి తిరదని కొందరు, నేడు
వెయ్యనేరాదని కొందరు బిగ్గె
కుయ్యవద్దు నోరుముయ్యనుచురాగ
గయ్యాళి బైటికిగదిమి బొమ్మనెకృష్ణా । (సారంగపాణి పదములు-194)

మంకు : (మూర్ఖత్వం)

"పెలుచై నవానికి ప్రియములు చెప్పితేను
కలుచపడుఁగాక సంగతెరుగునా
తలచుకొనీఁదానే తరి నాకిచ్చిన బాస
మలసి వూరకుండితే మంకుఁ దేరీనతఁడు" (xxiv-445)

ఈ ప్రయోగం వేమనలోనూ ఉంది.

ఇంటిలోనిధనము 'ఊదినాది' యనుచును
మంటిలోనదాచు మంకుజీవి;
కొంచుబోఁడు వెంటగుల్ల కాసునునాదు ॥విశ్వ॥
(వేమన పద్యాలు–పు. 22 ప. 148)

మలిగండ్లు (అలిగండ్లు మలిగండ్లు)
ఊలుదింటా మలిదండ్లా ఉడిరాసిగా నేరేము
తేలుచు శ్రీహరి నీవే దిక్కౌటగాక (x–61)

ఈ ప్రయోగం వేమనలోను ఉంది

'అలయచేసి మంచి యడిగొండ్లు మలిగొండ్లు
తెరిపెమిడెడు కటిక దేబెలెల్ల
నెలమి మన్నుదినెడు నెర్రలౌదురు సుమీ ॥విశ్వ॥
(వేమన పద్యాలు–పు 135 ప 34)

మోపు : (అధికము, ఎక్కువ, కట్టెలమోపు, అయినా ఎక్కువనే ఇక్కడ అర్థం).

'ఎగసెక్కపు వల పెందాకా
మొగమాటములే మోపానాకు' (xxii-400)

యేతువులు : (యాతువులెత్తె మాట్లాడాల్నా–అంటే హేతువులనే అర్థంలో ఈనాడు ప్రయోగంలో ఉంది)

'మలసి యేతువులెత్తు మాటలాడవలెనా
వలచి విన్నుడాయెక వసమైనవానికి (xxv-321)

సంతము : (సొంతము)

చక్కని శ్రీవేంకటేశ సంతమయితివప్పుడే
వెక్కసాలు మానితేను వెంగెమాడవిన్నను (xxvi-202)

సరకా (సరదా_తమాషా)

'ఎచ్చరించెద వనిన యీ జగంబనగాను
నచ్చరిత్రుడనీకు సరకా వోరి' (xii-314)

నవరేతిరి (నవరాత్రి)

'శ్రావణ బహుళాష్టమి నవరేతిరికాడను
అవేళ రోహిణి మంచిదైన యిద్దూనట
కావించ మేనమామకు గండమాట యితఁడే
దేవర్లు వీడవెల్లా దిక్కులఁజెప్పిరి (xxiv-27)

సోలిగా (వరుసగా)

'ఏలపిగ్గువదేవు యెదుటికిరాఁగదవే
సోలిగా నీసింగారాలు చూచ్చఁగాని యితడు (xxiv-290)

3.2 పదబంధాలు :

అపసోపము (కష్టంలేకున్నా అలసినట్లుండటం)
అపసోపమున నీవు అందుండి వచ్చినవేళ
అపెనితో నవ్వినది అరుదుగాదా' (xxii-198)

ఏపొద్దు (ఏదినం)

'నీదేవియైన లక్ష్మి నిచ్చనంపదలునిండె
అధికమై శ్రీవేంకటేశ ఆలె నీవుద్దానిండె
పొందిమై నీనిధియెల్లా భోగించేదేపొద్దో (ix'-127)

ఉద్దువుద్దులై : (జతలుజతలై)

'బుద్ధిలేని బుద్ధితోడ పొందుచేసుకొనినట్టి
యెద్దు బండికంటె సందివింగేము
నిద్దురతో తెలివంట నీటిలోనియండంట
వుద్దువుద్దులైలేని వొద్దికనున్నాము (ii–74)

ఈ ప్రయోగం వేమనలోను ఉంది.

"తనక గ్రామమునకు కారణకర్తలి
ట్లుండ యగుచు నుభయులుండిరేని
గండ పక్షియుగళముండిన కీళిని
యుద్దిగూడి బ్రతుకు చంద్రుకేమ" (వేమన పద్యాలు పు–140 వ. 67)

ఎగదిగి : (ఎదురు బెదురుగా, ఎరుకు తెరుకుగా)

'ఇత్తల వదియునుగాకే ఎగదిగ పోతవి చాచుచు
చిత్తజ గుణముల చెక్కులు చెమరించేవేమే' (xxii–331)

కడ్డాయపు పొందులు : (కడ్డాయము–షరతు–condition)

'ఇంత కడ్డాయపు పొందులేల మాకు
యెంతేసివారలు నీకు నెదురు చూచేరో (xxii–396)

గుణగుణలు : (గునగునలు)

ఏటికి మీ గుణగుణ వెరుగరాదు
తేటపరచగ రాదా దిద్దేము తగవు' (xxiv–321)

నెల్లి చెట్లు : (ఉసిరిక చెట్లు)

'పెళ్ళిచెట్టు మందుగాదు పెద్దకొండలెక్క తెచ్చే
నెల్లి చెట్టు చవిగాక నే మేల నీకు' (xxv–435)

నేరుపోనెయ్యమో : (ఇది నేరుపో, లేక ప్రేమో)

నేరుపో నెయ్యమో నన్ను మన్నించి పురమున మోచె
తారుకాణించగ రాదు తనకింక జోదు (xxvi–220)

మంకోమరులో :

"మంకోమరులో మదమో ముదమో
జంకో లంకో జగడమో
శంకలేక నను సరిగనం గూడితి
వేంకటగిరి గోవిందుడా (iii-77)

మనసు రానిదియాల : (ఇష్టపడని దెందుకు)

"మనసు రానిదియాల మానగరాదా
చనవిచ్చి నాకు వేరే సతులఁదే వలెనా (xxii)

ముయికి మూయాయె : (సరికి సరిఅయ్యె, కాముకలిచ్చిన వారికి సమంగ కామకలివ్వడం ముయ్యకిముయ్య)

"ముయికి ముయాయెనివే ముచ్చట లిద్దరికివి
నయముల మాయెదకు నవ్వులేమి నవ్వము (iii-203)

కన్నడ భాషలో పురందరదాసు ప్రయోగం ఉంది.

(ముయ్యగె ముయ్యాయితు ‌।)

మూసిన దాపిరములు : (రహస్యాలు)

"మూసిన దాపిరములేల ముందరికి రాఁగదవే
పేనపాల వెంటనే చిమ్మిరేఁగె వలపు (xxv-182)

శేనాశేనాలు : (శానాశానాలు - చాలాచాలా)

'చెంతల మొక్కేటివారు శేనాశేనాలుండగాను,
దొంతిగాఁ బైనొరగేవు దొడ్డతనము గాదా' (xxii-240)

ఈ ప్రయోగం సారంగపాణిలోనూ ఉంది.

'గంధమేల పూలుగలవు అక్కడశానా' (136)

మూడోపాడో : (సిగ్గో లజ్జో, మూడూపాడూ లేనోడు)

'పాడుశాఁ బరాకై తేఁ బదాలలో ముద్రచూపి
గోడచూచినఁ జిత్తరు కూటములోఁ బొడచూడీ
మూడోపాడో తనకు నొరిది నన్నింత సేయ
యీడా నుండదు చూడనింటనే వున్నాడు (xxvi–220)

3 3 క్రియా పదాలు :

ఆయనాయ : (అయిందే అయింది)

'ఆయనాయ నూరకుండు మంతేచాలు
చాయలు సన్నలునై తేఁ జప్పనయ్యీనిఁ కను (xxv–530)

ఆయలే : (వ్యంగ్యంగా అనడం)

"పాయము నీకు మీఁదెత్తి పడతి వుండఁగ నీవు
చాయ పేసుకొని యంత జాణవైతివి
ఆయలే బిరుదు బంటవై మెరిసినదెల్ల
రాయిడి యింతుల నింత రవ్వ పేసేదా" (xxii–134)

ఉండబట్టదా : (ఊరికే వుండులేకనా)

'వుండబట్టదా తనకు నూడిగము పేయఁగాను
చండిపెట్టి వ్రాత వ్రాపే చన్నులమీద (xxv–228)

ఎకబోసి : (ఎగబోయు, చాడీలుచెప్పి)

'చాయలనే యెకబోసె సన్నలనింత పేసి
యేయెడకుఁ బోసీవు ఇంతకంటే నేమే (xxv-368)

ఎగ్గెరగక : (అరమరిక లేక అనిష్టం లేక)

'సిగ్గిరి పెండ్లికొడుకు చెలుల ముందరనెల్లా
యెగ్గెరఁగక మెరపీ నిదివో యనుచు (xxiv–73)

ఎగ్గు ప్రయోగం వేమనలోనూ ఉంది.

'వెల్లకుక్కల యెంగిలి విశదమాయె
వడుచు వేశ్యల యెంగిలి ప్రాప్తమాయె
చెడుగు యెంగిలి యెంతకు శ్రేష్ఠమాయె
యిష్టమగువారి యెంగిలి యెగ్గువేమ'

(వేమన పద్యాలు – పు. 128 – పే. 449)

'ఎగ్గు లేనోడు' అన్నట్లు వ్యస్తంగా రాయలసీమలోని ప్రయోగం కాకీ సమస్త పదంగా 'సిగ్గు ఎగ్గు' అని అన్నిచోట్లా వుంది.

ఏకారేవు : (మిక్కిలి ఆశపడి దానికై ప్రయత్నించడం)

'చెలువై తేఁ జాలునట్టి చేరి యెంత వడియైనా
మలసి మలసి నీవు మాటలాడేవు
కొలఁది మీరినట్టి కుచములు గంటేఁ జాలు
యెలమి నూరకయైనా యేకారేవు (xxv-34)

కుప్పిళించి : (కుప్పించి, ఎగిరి)

కొప్పు చక్కఁబెట్టుకొంటా కొలువులు పేసుకొంటా
చెప్పవేఁ జన్నుల కొత్తనెలఁత నిన్ను
వుప్పతిల్లుఁ గతలతో నుడివోని జవ్వనాన
కుప్పళించి వలపులు గురిసీ నీ యెదుటఁ (xxvi-30)

కూడిమాడి వుండేది : (కలపి మెలసుండేది)

'వేడుకమాట లెన్నైనా వేవేలు నాడగవచ్చు
కూడిమాడి వుండేది గురుతుగాని' (xxiv-217)

కూడుకొందుగా : (కలుసుకొని, తనదిగా చేసుకొను)

'వల్లెగా విటుండనై రేవల్లెలో నుండేనాడు
గొల్లెతనయినా నిన్ను కూడుకొందుగా' (ii-12)

కేకరించీని : (కొంగ్రించీని)

'వెలయ నీతో నేను వేడుకకు నవ్వఁగాను
వలినాక్షి యెవ్వతో సన్నలు పేసీని
నిలిచి నీవు నాతో నెయ్యములు చూపఁగాను
కెలన నుండితాను కేకరించీని" (xxiv-563)

కోకో : (తీసుకొమ్ము)

'కోకలేల తీసితివి గోవిందుఁడా ! నీకుఁ
గోకో ఇదివో యెక్కు గోవిందుఁడా' (xxvi-3)

కోవయ్య : (తీసుకోవయ్య)

'కొంచెపు వెన్నెలలివి కోవయ్యా కానికె
మంచి మొల్ల మొగుడలమాటునాఁ చాయలివి (xii-35)

గునిసీని : (ఎగిలేని, గెంతిని, మిడిసిపడేని)

'వనువునాతో నవ్వులు నవ్వితివంటా
గునిసీనాపె నిన్నుఁ గొచ్చికొచ్చి
చనవరి వినోదాల సరసురాలన్నిటాను
వొనరా నాపెతో నవ్వి వుండవయ్యా నీవు (xxv-43)

చేనుకుండేది : (చేసుకొనేది)

"అవల రమణుఁడెంత యగ్గలికఁ దిరిగినా
చవి పేనుకుండేది నకియ" (xxiv-368)

చౌకళించి : (కుప్పించి)

"నందడి లోపలనే సంగడిఁ దేరుఁలనిల్పి
కందువతోఁ జౌకళించి కాఁగిలించేను" (xxiv-138)

దావతిపడి : (ఆదుర్దాపడి, దావంతంపడి)

'దేవదానవులు ధీరతను
రావతిపడి వార్ధిఁదరువఁ గను

శ్రీ వనితామణిఁ జెలఁగి పెండ్లాడిన
శ్రీ వేంకటగిరి శ్రీనిధికి' (xii-18)

దొబ్బేవు : (తోపేవు, నెట్టేవు)
'సిగ్గుతో నుందాననంటా శ్రీవేంకటేశ్వరుఁ దెచ్చి
దగ్గరించి పై దొబ్బేవు తతిగానవే' (xxii-91)

వంగించు : (ఎత్తి పొడుపు)
'చేతులు చాఁచి చాఁచి చేరినతో వాదడిచి
అతలఁ బంగించితిగా అయ్యో నిన్ను
నీతిలేని మంకుదాన నీవు చెప్పిన పన్నులు
తోతోయ నీ పాదమునఁ దోసితిఁగా నేను" (xxii-120)

పుడికేవు : (తడిపేవు)
"సరుస నన్నుఁబెట్టుక చన్నులెంత పుడికేవు
గరిమి నీ మన్ననలు గై కొంటినయ్యా" (xxiv-75)

పూచుక : (తనదే అన్నట్లు పట్టించుకొని)
"పోటి చెలిక తెగాన పూచుకనే నూటాడితి
ఆటది గోలఁయైతే నద్దే మొత్తుదురా" (xxii-554)

పొద్దుపోదా : (పనిలేక కాలం గడవదా)
'పోపో యింకా నేటికి పొద్దుపోదా
పై పై నీకు మొక్కేము పదివేలు వచ్చేను" (xxii-201)

మల్లాడు : (తిరుగాడు)
'తగు మోహ సలిలంబు దాట మతిలేదు గవ
మగుడంబడి భవనములో మల్లాడ వలసె' (ii-210)

మాగిన : (పండిన)

'కాఁగలించితివా లెదో కాంతనల్లనాడు నీవు
కాఁగలించితి నేడు కమ్మటి నిన్ను
పేఁగక శ్రీవేంకటేశ వేమారు సాధించనోప
మాఁగిన రతులఁబెను మాయలింకేలా' (xxvi-98)

మొరిగేవు : (బొంకేవు, అబద్ధమాడేవు)

'ఇంతి పాదములతుక యిదివా నీకున నంట
వింతలోనె మొరిగేవు యదివొమాటా' (iii-508)

వక్కలాయె : (ముక్కలాయె)

"వెక్కసపు గుబ్బలపై వేసిన కప్పురమెల్ల
నొక్కమాటే నీరాయ నోయమ్మా
మిక్కుటమైన దీని మేనిమీద లెక్కచూచి
వక్కలాయె గుండె యిట్టి వలపెందు గలదా" (xii-328)

వేసరుకో వలదు : (యాసరికోవద్దు, అసహ్యించుకోవద్దు)

'వేసరుకోవలదు విభుఁడెలయించితేను
అసరేచ యిచ్చకములాడుట గాని' (xxii-442)

సంచకారిచ్చితిని : (బయానా యిచ్చితి)

'దొరవు నీవు నేను దోసిటి పాలదానను
పరిలక్షకు నా మొక్కు సంచకారిచ్చితిని' (xxii-292)

సదరమైతినా : (సదరమైతినా, పలచనైతినా, తేలికైతినా)

'కొంత కోక నల్లనైతే గొరుపడమునవేవు (?)
అంత నేను సదరమైతినా నీకు
పంతగాడవటి యాకంబళి నీవు ధరియించి
అంత నింతనుండి యాల అవుల గాచితివి' (xii-152)

పై పరిశీలనవల్ల అన్నమాచార్యుని సంకీర్తనల్లోని రాయలసీమ మాండలిక పదజాలం, దాని స్వరూప స్వభావాలు సూక్ష్మాతి సూక్ష్మమైన అర్థభేదాలు మొదలైన అంశాలన్నీ మనకు స్పష్టమవుతాయి.

4.0 ఇది కేవలం అన్నమాచార్యుని సంకీర్తనల్లోని రాయలసీమ మాండలిక పదప్రయోగానికి సంబంధించిన దిఙ్మాత్ర ప్రదర్శన మాత్రమే. ఇంకాలోతుగా పరిశీలించి, సూక్ష్మాతి సూక్ష్మమైన అన్నమాచార్యుని భాషా రీతుల్ని ప్రత్యేకించి అన్నమాచార్యుని రాయలసీమ మాండలిక పద ప్రయోగాన్ని గూర్చి పరిశోధన చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది. దానివల్ల అన్నమాచార్యుని హృదయావిష్కరణకు సంబంధించిన తీరుతెన్నుల్ని స్పష్టం చేయడమేగాక కొంతవరకైనా మనం ఋణ విముక్తులం కాగలమని భావిస్తాను. అందుకై పరిశోధకులు ప్రయత్నిస్తారనీ, వారికితోడ్పడిక సాయం తిరుమల తిరుపతి దేవస్థానం వారు చేస్తారనీ ఆశిస్తున్నాను

## ''కూరాకు' పదవివరణ' సమాధానం

1983 ఏప్రిల్ భారతిలో పూజ్యులు శ్రీ 'తి' గారు "'కూరాకు' పదవివరణ"ను గూర్చి లేఖ రాశారు. 1982 డిశంబరు భారతిలోని నా వ్యాసం 'అన్నమాచార్యుల సంకీర్తనలు – రాయలసీమ మాండలిక పదప్రయోగం' బాగుందని ప్రశంసిస్తూనే 'కూరాకు'ను గూర్చి వారు చర్చించారు. వారి ప్రశంసకు నా కృతజ్ఞతలు.

'తి' గారికి సమాధానంగా 1983 నవంబరు భారతిలో శ్రీ కపిల వాయి లింగమూర్తిగారు 'కూరాకు' అన్నది 'ఖురాక్' శబ్దభవం కాదని వివరించారు. అయితే నేనిచ్చిన అర్థమూ పొసగదని పేర్కొన్నారు. మళ్ళీదానికి వివరణగా 'తి' గారు

" 'కూరాకు' (మి)మాంసం" అని 1984 సెప్టెంబరు భారతిలో పునః పరిశీలించి, 'కూరాకు' అంటే 'మాంస'మనే తీర్మానించి 'పండితులే నిర్ణయింతురు గాక' అని వదలివేశారు.

పై ఇద్దరు పండితులకు నా సమాధానమిది. 'తి' గారు 'కూరాకు'ను మిశ్ర దుష్ట సమాసం అని పేర్కొని వివరించారు. పై పెచ్చు దీన్నిబట్టి 'కూరాకు' 'ఆకు కూర' కాదని తెలిసింది. 'కూరాకు' కోసం మనం వేరే అంగట్లో వెదుకవలసి వస్తుంది" అని అన్వేషణ సూచించారు. అతః పూర్వమే "'కూరాకు' రాయలసీమ మాండలికమైతే, 'ఆకుకూర' ఏ ప్రాంతపు మాండలికం ? 'ఆకుకూర' కూడా మాండలికమా ?" అని ప్రశ్నించారు బాగుంది ఇక్కడ మనం ఒక అంశం గుర్తుంచుకోవడం అవసరం. 'కూరాకు'ను రాయలసీమ మాండలికమని పేర్కొన్నానే గానీ, 'ఆకుకూర' మాండలిక మనలేదు. అది దానికర్థమని తెలిపాను. కారణమేమంటే కోస్తా ఆంధ్రలో 'ఆకుకూర' అనే వాడుకగానీ 'కూరాకు' అనే వ్యవహారం లేదు ఇది స్వస్తవం కాదు; వాస్తవం :

మొదట వారు 'కూరాకు'ను మిశ్రదుష్ట సమాసవన్నారు. ఆ వెనుక "కూరాకు" అనే పదం రాయలసీమ పల్లెలలో 'మాంసము'నకు పర్యాయపదంగా వాడబడుతూ ఉంది" అని పేర్కొని ఇది 'ఖురాక్' ఉర్దూ (అరబ్బీ లేక పారశీక) పదం నుంచి వచ్చిందనీ, చివరకి 'కూరాకు' అంటే మాంసమనే అర్థంలో ప్రయోగించబడుతూ ఉందనీ వివరించారు.

కానీ వారు మొదట 'కూరాకు' అంటే మిశ్ర దుష్టసమాసమనీ, కూర+ఆకు అని విడగొట్ట వీలుపడదనీ పేర్కొని, ఆ వెనుక ఇది 'ఖురాక్' పద నిష్పన్న మనడం తమాషాగా ఉంది.

కోస్తా ఆంధ్రలో 'ఆకుకూర' అని దేన్నయితే అంటారో అదే అర్థంలో 'కూరాకు' అనడం రాయలసీమ పల్లెటూళ్ళలో ఈనాడూ మనం వినేమాట "'పుచ్చిన కూరాకును దులిపినట్లు దులుపుతావే", "కూరాకును నలిపినట్లు నలుపుతావే" అనే

మాటలు తెలుగు కన్నడ ప్రాంతాల్లో అంటే అనంతపురం-కోలారులలో ఈనాడూ మనకు వినిపించేవే. అంతేగాక నేను ప్రభుత్వోద్యోగరీత్యా తెలుగునాట పర్యటించి నివసించడం మూలాన గ్రహించగలిగిన విషయం. నా అవగాహనలో ఎలాంటి లోపమూ లేదనీ ఇప్పటికీ నమ్ముతున్నాను. వారు భావించినట్లు ఎక్కడైనా 'కూరాకు' అంటే 'మాంసం' అని వాడే వాళ్ళున్నారేమోగానీ, నేను విన్నంత, కన్నంత, నాకు తెలియవచ్చినంత మాంసమనే అర్థంలోనూ, వ్యస్తంగా 'కూర' అని మాత్రమే అదీ కొందరు వాడుతారు.

ఇక్కడ అన్నమాచార్య సంకీర్తన పూర్తి పాఠం గమనించగోరుతున్నాను :

"చెలఁగి కూరాకుగాఁ జేసేవు నీ
తలమీఁద నుండే తరుణిఁబో నేను ॥పల్లవి॥

పిసుకకు పలుమారు పసురు వేసినంత
పసివాడు కోర్చిన వనితఁ గాను
పసరేఁచి నీవింత పాలించు తొల్లిటి
పిసువయిన నీపెట్టుఁ జెట్టఁబో నేను ॥చెలఁగి॥

చిదుమకు పలుమారు చెక్కునొచ్చీ నీవు
వదనము నొక్కేటి వనితఁగాను
ఎదురెదురునే భూమి నెందరు లేరు నీ
నిదురవచ్చిన వారు నేనెవ్వతిని ॥చెలఁగి॥

కందించకు నన్నుఁ గొఁగిట కాఁకల
అందునిందును గడు నలుముచును
ఇందిరాపతి వేంకటేశ నీరతుల
పొందు నాకిదె మఱపులకెల్ల నెలవు ॥చెలఁగి॥ (12-194)

ఈ పదంలో 'కూరాకుగాఁ జేసేవు' అనడంలో 'మాంసం' అన్న అర్థం గోచరించడం లేదు. పై పెప్పు 'కూరాకులాగ నన్నెందుకు నలిపివేస్తావు?' అంటుంది నాయిక నాయకునితో. ఇది నా పై వివరణను స్పష్టీకరిస్తూంది. దీన్ని గూర్చిన వాదోపవాదాలకు తావేలేదు.

మరో విశేషమేమంటే 'తి'గారు 'కూరాకు' విడదీయరాని మిశ్రదుష్ట సమాస మని పేర్కొని "కూర అంటే ఆకు ఉదా॥ తోటకూర, దంటుకూర" అని వివరించారు. సరే బాగానే ఉంది వారి మాటల్లోనే. మెంతికూర, పాలకూర, చుక్కకూర, బచ్చలికూర అనే ఆకుకూరలూ ఉన్నాయి. ఇంకా కాయగూరలు, ఆకుకూరలు అనడమూ ఉందిగదా? అలాగే కూరగాయలూ ఉన్నాయి. ఇంతకీ చెప్పవచ్చిందేమంటే 'కూరాకు' అన్నది 'ఆకుకూర' అనే అర్థంలోనే అన్నమాచార్యుడు ప్రయోగించాడు; అతని హృదయావిష్కరణమే నా ముఖ్యలక్ష్యం. 15వ శతాబ్దంలో పద కవితా పితామహుడు ప్రయోగించినా ఈనాటికీ ఆ పదం మామూలు జనం వాడుకలో ఉంది. ఈ విషయం చెప్పడానికి ఇంత వివరణ అవసరమైంది. 'కూరాకు' మాండలికమనే ఇంకా నేను సహేతుకంగానే విశ్వసిస్తున్నాను.

ఏ పదం ఏ భాషలోనుంచి వచ్చినా అది పరిమిత ప్రదేశంలో ప్రచురంగా ప్రయోగంలో ఉన్నప్పుడు, తక్కినచోట్ల అలా వాడనప్పుడు తప్పక మనం భాషా శాస్త్రానుసారం దాన్ని మాండలికమే అనడం సముచితం గదా?

---

# క్షేత్రయ్య పదాలు - భాషా వైభవం

1. క్షేత్రయ్య పదరచన చేసి ఉత్తమ వాగ్గేయకారుడుగా సముచిత స్థానం ఆక్రమించుకొన్నాడు. తెలుగు భాషా మర్మజ్ఞుడు క్షేత్రయ్య. తెలుగులోని తేటను, తియ్యదనాన్ని సంగీత సాహిత్యాభినయాల్ని తన పదాల్లో ప్రదర్శించడానికి జొప్పించి కృతకృత్యుడైనవాడు క్షేత్రయ్య. అతని చేతిలో సంస్కృతాంధ్ర భాషలు మైనంలా కరిగిపోయి సమ్మిళితమై పోతాయి. హృదయంగమమైన భావస్ఫోరకాలై సహృదయు హృదయాల్ని సతతం సంతసింప చేస్తాయి. తెలుగు నుడికారానికి తిక్కన తరువాత పేర్కొనదగినవాడు క్షేత్రయ్య. అతని పదాలన్నిట తెలుగు పలుకుబళ్ళు, జాతీయాలు, సామెతలు, లోకోక్తులు కోకొల్లలు. అవన్నీ సందర్భ పూర్వకంగా సముచితంగా ప్రయుక్తమైనవే గాని అనౌచిత్యం పాలు కాలేదు. పైగా ఇవన్నీ తమకు తామై వలచివచ్చి - క్షేత్రయ్య మువ్వ గోపాలునికై వలచినట్లు - క్షేత్రయ్య పదాల్లో సమకూరి పదాలకు అందచందాలు, జిగిబిగి, బింక పొంకాలను చేకూర్చాయి. దీనివల్ల క్షేత్రయ్యకు భాషపై ఎంతటి అధికారముందో స్పష్టం కావడమేకాక క్షేత్రయ్య తెలుగు భాషా జీవతత్వాన్ని ఎలా పట్టుకోగలిగాడో అవగతమవుతుంది. ఇది మహాకవి లక్షణం. సంస్కృత పదాలు చాలా తక్కువే ఈతని పదాల్లో వున్నప్పటికీ అవి సైతం తెలుగు పదాల్లాగే ఇమిడిపోయి ఉండడం గమనించదగ్గది. సంస్కృత మహాప్రాణాలు గల శబ్దాలుగాని, కఠిన శబ్దాలుగాని మనకందు కవిపించవు. ఇది క్షేత్రయ్య భాషా విశిష్టత.

2. జానుతెనుగు :_ మహావాఙ్మయ నిర్మాణ యజ్ఞంలో తెలుగు జాతీయతను నిలిపిన కవి తిక్కన సోమయాజి. అందు ముఖ్యుడైన పాల్కురికి సోమనాథుడు జానుతెనుగులో కవిత్వం మొట్టమొదటిసారిగా చెప్పాడు. ఇలాంటి జానుతెనుగునే క్షేత్రయ్య తన పదాల్లో వాడుక చేశాడు. పాల్కురికి సోమనాథుడు జానుతెనుగులో తాను కవిత్వం చెబుతానన్నాడు

'ఉరుతర గద్యపద్యోక్తుల కంటె
సరసమై పరగిన జాను(దెనుగు

చర్చింపగా సర్వసామాన్యమగుటఁ
గూర్చెద ద్విపదలు గోరిరుద్రైవాణి' (బసవపురాణము – పు. 8)

'ఆరూఢ గద్యపద్యాది ప్రబంధ
పూరిత సంస్కృత భూయిష్ఠ రచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జాను దెనుఁగు విశేషము ప్రసన్నతకు' (పండితారాధ్య చరిత్ర)

సర్వసామాన్యమైన అంటే సర్వ ప్రజలకు సులభంగా తెలిసే భాష అంటే ప్రజల భాషలో – జాను దెనుగులో కవిత్వం చెబుతానన్నాడు పై ద్విపదల్లో సోమనాథుడు. నన్నెచోడుడు సైతం 'సరళము గాఁగ భావములు జానుఁ దెనుంగున నింపు పెంపుతో విరిగొన....' [కుమార సంభవము (1–35)] అని చెప్పుకొన్నాడు. 'పిల్లైనంత వరకు ప్రౌఢ దీర్ఘ సమాసమును తగ్గించి వాని మూలమున వ్యక్తమగు భావమును తెనుగు పదముల నుడికారపు సొంపుచే వెల్లడి చేయగలిగినదే జాను తెనుగు రచన'[1] ఇలాంటి రచన క్షేత్రయ్యది ఇది అతని పదాలన్నిటా కనిపిస్తుంది.

2.1 కొంతవరకు సాంకేతిక వివరణకో, భావస్ఫూర్తి కోసమో, సందర్భశుద్ధిగా అక్కడక్కడ సంస్కృత పదజాలం వాడటం క్షేత్రయ్యలో కద్దు. అదైనా చాలా సకృత్తుగానే వచ్చును :–

పల్లవి : ఇద్దరి హృదయము లేక హృదయమైతే – వద్దనే వారెవ్వరే ?

అ. ప : నద్దుచేయక నావద్దకి వచ్చి – ముద్దుబెట్టుచు మోవియానుచు మోదమున నన్నాదరించుచు ॥ఇద్దరి॥

1. అలివేణి ! వినవే యాయాదిత్యుని పావము
బలిగా ఎదురుగా – బట్టెనంచు !
చెలియరో ! వినవో యీ జలజము లలర గలిగి
చిలుకల కొలికి ముద్దుల – గులికి నాతో పలుకరింపగ ॥ఇద్దరి॥

1. శ్రీ కోరాడ రామకృష్ణయ్య–జానుతెనుగు–భారతి–జూన్, 1946.

2. చంద్రమండలమున - సంకేతమే మేఘ
బృందము బాధించెనటంచు
ఇందీవరముల వికసింపవే భామ! మందగమన! మకరందభాషణ!
సుందర స్వచ్ఛందము మన ॥ఇద్దరి॥

3. చంచల మతినీవు - చాడిమాటలువిని
వంచనల కొడిగట్టినావేమో!
పంచశరుని గన్న ప్రణతార్తిహరుడు మా
కంచివరధుని మంచితనమున నెనరుంచి కరుణించగ మన ॥ఇద్దరి॥

ఇలాగా కొంచెం అధికంగా సంస్కృతశబ్దాలు ప్రయోగించి చేసిన పదరచన తక్కువనే చెప్పాలి. ఇట్లే కొన్నిపదాల్లో కొంచెం ఎక్కువ సంస్కృతపదాలు వాడబడ్డాయి. అయినా అవి ఆయా విషయవివరణార్థం సార్థకంగా ప్రయోగించబడ్డాయి. వ్యస్తంగా చిన్నచిన్న పదాలేగాక రెండుమూడు శబ్దాలతోడి సమాసాలు సైతం వాడబడ్డాయి. పై నుదాహరించిన పదంలో 'చంద్రమండలము, మేఘబృందము, సుందర స్వచ్ఛందము, మందగమన, మకరందభాషణ, చంచలమతి, ప్రణతార్తిహరుడు, పంచశరుని' అనేవీ, 'గంధవతి కుచకలశముల, అమృతపానము, శ్రీవేదపురి నిలయుడైన, మురళిగానలోల' 'ప్రాణసఖి, తామరసాక్షి కర్ణశూలములై' గానవిద్యా ప్రౌఢమి, భూషణభూషితురాలై, మోహినిసుదతి' ఈ మొదలైనవీ చిన్నచిన్న సమాసాలు సకృత్తుగా ప్రయుక్తాలయ్యాయి. ఇవన్నీ పదలాధిత్యంతో, పదానికి వన్నెగూరుస్తూ తెనుగుదనాన్ని పరిరక్షించేవిగానే ఉంటాయి. 'అల్పంపటా భిక్షం' అన్న సంస్కృత సూక్తిని చాలా చక్కగా వాడాడు క్షేత్రయ్య-

'సతతముగ నొకనాడైన-చక్కగానైన నినుజూచిన
హితవు మీరను తమక-మెపుడైన నను రేచిన
వితలెంతరాక కులికెదవు-పేరు విన్నంతమాత్రననే పుబ్బె
అతిశయంబేమి? నీకు మెరుపడి-అల్పంపటా భిక్షం'

తెలుగుతోపాటు సంస్కృత భాషామర్మం బాగా తెలిసిన కవి క్షేత్రయ్య అని స్పష్టమవుతుంది.

కాని తెలుగు నుడికారంతో సర్వశోభాయమానంగా జానుదెనుగుతో రచించడమే క్షేత్రయ్య విశిష్టత.

వల్లవి : వేళకాదుర గడియ_తాళరసామి

అ.ప. : చాలు చాలు పది_వేలకైన నిది ॥ వేళ ॥

1. ఊరక నా పైని_నేరమెంచక
పోరుచు మాబావ_గారున్నారోయి
కూరిమి నాతోడి _ కోడలిపడకింట
చేరికయందుండ _ మేరకాదోయి ॥ వేళ ॥

2. ఒద్దికతోమన _ మిద్దరము కూడి
సుద్దులాడుట కిది _ ప్రొద్దుకాదోయి
పద్దుమీరగ నా _ పగవారివద్దనే
సుద్దివిన్నంత _ కొద్దికాదోయి ॥ వేళ ॥

ఈ పదంలో 'వేళ' 'నేరము' అన్న శబ్దాలు తప్పిస్తే, సంస్కృతశబ్దాల ప్రసక్తి లేక తేటతెలుగు మాటలతో క్షేత్రయ్య ఎంతచక్కని పదరచన చేశాడో గమనించవచ్చు. ఊరక నేరమెంచక పోరుచు. ఒద్దికతో సుద్దులాడుటకు, పగవారి వద్దనే సుద్దివిన్నంత, కొద్దికాదోయి మొదలైన పలుకుబళ్ళ బలిమీ, సొగసు_తెలుగు బాస తెలిసిన ఎవరికైనా అవగతమవుతుంది మరొక్క ఉదాహరణ :

వల్లవి : ఎవ్వతె నిన్ను బోధించెనో ;

అ.ప : మువ్వగోపాల ; నాదు _ ముచ్చటచెల్ల నీయక
ముదుగునడిపించుమని _ ముమ్మాటికి చలపట్టి ॥ ఎవ్వతె ॥

1. ఇన్నాళ్ళదాక నిరుచెవి _ యెరుగనీక
నన్ను గావలసి నీవు నడిచితివి
మున్నున్నదయలేక _ మొగనాలని యెంచక
కన్ను మరుగుగానిచోటు _ గా చెక్కిలి చీరుమని ॥ ఎవ్వతె ॥

2. విరివాసనకూడిన — వితమున నీవునేను
అరమరలేక యుండే — యందముచూచి
విరసమెందునులేదు — వీరికనితలచి
గురుతుగా నామోవి — గుమ్మోలు వోనొక్కమని ॥ ఎవ్వతె ॥

3. హెచ్చుతమి నీవద్ద ను — రింతసేపు నేనుండిన
వచ్చి తరువాయిమాట — వచ్చీనందవు
కుచ్చితమున మాముమ్వ — గోపాల ! నన్నుగూడి
యిచ్చట తెల్లవారుదాక — నింటికిపోనియ్యవద్దని ॥ ఎవ్వతె ॥

—ఇందులో ఏకొన్ని సంస్కృతపదాలో తప్ప తక్కినవన్నీ తెలుగుమాటలు. పైనిచెప్పినట్లు జానుదెనుగుభాష కిది చక్కటి ఉదాహరణ. 'విధము' 'శబ్దము' 'వితము' అని ఎలా తెలుగుభాషలో కలిసిపోయిందో అర్థమవుతుంది. 'విరి వాసన' అన్నపుడు 'విరి' తెనుగు 'వాసన' సంస్కృతమనే భావమే మనకు కలుగదు. 'విరి' పదం తెలుగులో చక్కటిశబ్దం ఇందులో తెనుగు దనాన్నిచూపే పలుకుబళ్ళకు కొదవలేదు. పల్లవే చక్కని నుడికారంతో ఆరంభమైంది. 'నాదుముచ్చట చెల్లనీక, ముందుకు వడిపించుకుని, ముమ్మాటికి చలపట్టి ఇన్నాళ్ళదాక, ఇరుచెవి యెరుగనీక, మొగనాలనియెంచక, కన్నుమరుగుగాని చోటు, కూడినవితమున, నీవునేను అరమర లేకయుండే యుందము, మాటవచ్చీనందువు' ఈ పలుకుబళ్లు తెలుగునుడికారాన్ని జాతీయతను, తెలుగుజాష అంత స్తత్వాన్ని పట్టిస్తున్నాయి ఇందులోనే 'విరివాసిన కూడిన వితమున నీవు వేను అరమరలేక యుందేయందము'—అని అంటుంది. నాయిక నాయకునితో. ఈ ఔపమ్యం సహృదయరంజకం. విరి—వాసన, నీవు—నేను క్రమాలంకారంతో కలసి ఉపమాలంకారం పొదిగాడీ మహాకావ్యశిల్పి ఇలాంటి నినర్ల మనోజ్ఞమైన రచన మన ప్రౌఢకవులలోను చూడలేమంటే ఎవరైనా కోపగించుకో పనిలేదు ఇది క్షేత్రయ్య పదకవితలోని భాషావైభవం

ఈ భాషావైభవాన్ని అనంతముఖాలుగా దర్శించవచ్చు.

## 3. సామెతలు :

ఏ భాషకైనా సామెతలు, లోకోక్తులే జీవగర్రలు. ఆ భాషా తత్వాన్ని ఎంతగా ఒక కవి గుర్తించగలిగిందీ, అతడు వాడే లోకోక్తులు, సామెతలనుబట్టి

వుంటుంది. ఆ భాషను తనలో జీర్ణించుకొన్న కవి చాలా చక్కగా, అతికినట్లు, సందర్భోచితంగా ఉంటుంది. అందుకు క్షేత్రయ్య వాడిన లోకోక్తులే పరమ నిదర్శనం కింది పదంలో 'విరవీగుతున్న' నాయికను పరిహసిస్తూంది సఖి.

పల్లవి : ఎన్ని కోకిళ్ళ బోయేవే - యింతిరో నీవు ?

అ. ప : ఎన్నడు మువ్వగోపాలు - డెనసెనో ? విరవీగేవు ॥ఎన్ని॥

1. సతతముగ నొకనాడైన - చక్కగా నిను జూచీన ?
హితవు మీరను తమక - మెపుడైనను రేచీన ?
వితవెంతరాక కులికెదవు - పేరు విన్నమాత్రననే వుబ్బె
అతిశయంబేమి ? నీకు మెరువడి - అల్పంపటా భిక్షం' ॥ఎన్ని॥

2. సరివారు గైకొన్నట్లు ఎచ్చైన - సరిగకోకల గట్టేవు ;
సరసముగాను ఇంటి వెచ్చానికై పదిరూకలు
మరచినావా ? ఇకనేమో, యొక - మంచి వలువతోనే, అల్పునికి
ధరనైశ్వర్యము వచ్చితే - అరదరాతిరి గొడుగు బట్టుకొన్నట్లు ॥ఎన్ని॥

3. నిన్ను నీవే మెచ్చుకొనుచు, నిలువుటద్దము చూచుకొనుచు
చెన్నుగ నీరతుల మెప్పించు చెలగితి ననేవు :
కన్నవారితో సాటి యెక్కుడద నీవు
ఎన్నదెక్కనివాడు గుర్రమెక్కితే ముందు వెనుకైనట్లు ॥ఎన్ని॥

ఈ ఒక్క పదంలో క్షేత్రయ్య మూడు సామెతలు ప్రయోగించాడు. ఏదో కావాలని సామెతలందులో ప్రయోగించినట్లు కాకుండా, సహజసిద్ధంగా, సందర్భోచితంగా వాటికవి వచ్చి పదంలో చోటుచేసుకొన్నాయి. పైగా సంస్కృత సామెతను సైతం వాడాడు అల్పునికి ఐశ్వర్యం వస్తే అర్ధరాత్రి గొడుగుబట్టినట్లు, ఎన్నదెక్కనివాడు గుర్రమెక్కి ముందు వెనుకలైనట్లు' సహజంగా నిత్య జీవితంలో తెలుగువాడు ఈ సామెతల్ని వాడటం కద్దు ఇది క్షేత్రయ్య తెలుగు భాషా జీవతత్త్వాన్ని గుర్తించిన విధం ఇది మహాకవి లక్షణం. ఇట్లే మరికొన్ని సామెతలు మనం ప్రతిదినం వాడేవే కనిపిస్తాయి

'కలిమిలేములనగా కావడి కుండలు'

'సౌరిది వ్రతము చెడిన సుఖము లేదాయెగదా'

'బూరుగమాను కాసించి పొంచిన చిలుక చందమాయె'

'అరటాకు సామెత యట్లు'

'తెల్లనివెల్ల పాలు నల్లనివెల్ల నీళ్ళనుచు.... నమ్మి నేనుంటినే'

'ఏ పుట్టలో ఏమున్నదో ఎరుగనైతి'

'తడయకనే నొకటి తలంచితే దైవమొకటి తలచినందుకు'

'రంకాడ నేర్చినది బొంకాడ నేరదే'

'తల వ్రాలెవరికి తప్పింప వశమే'

'నాపై గల ప్రేమ నీటిపై వ్రాలాయెనేమో'

'చిలుక బూరుగమాను ఫలముకాసించి చింతించినట్లాయివే'

'ఇంట గెలిచి రచ్చ గెలువవలె'

'మేకవన్నె పులివంటి చెలులే'

'వలపు సిగ్గెరుగదని పలికేరు'

'చెరుకు తీపని వేరుతో పెకలించేవు'

'చలియించని నిండు కుండవలె నుండునమ్మా

ఇట్లే సామెతలు సందర్భోచితంగా వాడి తెలుగులో తన పదకవితకు ఎంతో విశిష్టతను కొనితెచ్చాడు క్షేత్రయ్య.

4. పలుకుబళ్ళు :

సామెతలులాగే పలుకుబళ్లు సైతం ఆ భాషా జీవతత్వాన్ని పట్టి యివ్వగలవన్న విషయం పూర్వోక్తం. సర్వజన విదితం పలుకుబడి లేదా నుడికారం అన్నది ప్రతి భాషకు ఉంటుంది అది దాని సొంతం వీటిని సమంగా ఒక భాషలోనుంచి

పరో భాషలోనికి అనువదించడం చిక్కైన సంగతి. ఇదే ఆ భాష గొప్పదనానికి కారణభూతం. క్షేత్రయ్య తన పదాల్లో తెలుగు పలుకుబళ్ళను కుప్పలు తెప్పలుగా వాడుకొన్నాడు అనడం కంటే ఆ పలుకుబళ్లు ఆయన పదాల్లో వచ్చి చేరాయనడమే సముచితం. 'బాగాయె నీవగాలెల్లా మా బాగాయె' అనే పల్లవి ఉంది. ఇందులో పదంలోని ప్రధాన భావం ఇమిడి ఉంది. నాయిక నాయకుడు చేసిన వగలను దూరుతుంది. 'బాగాయె' అన్నది తెలుగు పలుకుబడి. ఈనాడు గూడ రాయలసీమ పల్లెపట్టులలో 'బాగాయె, మాబాగాయె' అన్నమాట వినిపిస్తూనే ఉంటుంది. 'బాగాయె' పలుకుబడిలోనే పదంలోని అర్థమంతా ఇమిడి ఉంది. పల్లవి, అనుపల్లవి, తరువాతి చరణాల అంతంలోను పునరుక్తి చేయడంలో నాయకుని చేష్టలను నాయిక ఎంతగా నిందిస్తూందో, భావసాంద్రతను, గాఢతను, స్ఫూర్తిని విస్పష్టం చేస్తుంది. ఇదే పలుకుబడిలోని గొప్పదనం. అంతేగాక ఆయా పలుకుబళ్ళకు తెలుగుదనాన్ని జాతీయతను సృష్టించేసే సామర్థ్యం వుంటుంది. అది కవియొక్క భాషా మర్మజ్ఞతపై ఆధారపడి ఉంటుంది తెలుగు భాషా స్వభావాన్ని పట్టియిచ్చిన తిక్కన తరువాత క్షేత్రయ్యనే పేర్కొనవలసి ఉంది క్షేత్రయ్య బలుకుబళ్ళనన్నిటిని ఏర్చి కూర్చడం ఇచట సాధ్యమయ్యే పనికాదు. అందుకై ప్రత్యేకమైన కృషి, పరిశోధన అవసరం. అదే ఒక ప్రత్యేకమైన సిద్ధాంత వ్యాసం అవుతుంది. కొన్నింటిని మాత్రమే నేనిక్కడ పేర్కొంటున్నాను.

'చల్లనాయె నా మనసు, అసురసురన్నది, మూతులు దిప్పేరు, కొండంత కావురమే, మనిషామాకా, చాలుచాలు వదిపేలు, అపరూప దర్శనం బాయె, కనుల పండుగగాను, రచ్చలు చేసినాడె, కన్నుల నౌతుక, నవ్వులకైన, వెన్నవంటి మనసు, వెగటాయెనా ?, దృష్టి తాకు, దిక్కుమాలిన మోహము, కన్నులావ, దయ గోరంతైన లేదాయె, బతిమాలిన రాదాయె, ఏ మందు బెట్టిరో చెలులు, చేతిలో చేయివేసిన, నూగింజైన నాననియరు, మేకవన్నె పులివంటి వారు, మునిముచ్చులు, కోపము ముక్కునున్నది, పాలు నీరువలె కలసియుండక, కన్నుల గట్టినట్లుండ, లక్కవంటి మనసు రాయై, వెలవెల జోనేల మోము, మనసు గట్టిచేసుకోవే, అదురు బెదురులేక, పూచిన తంగేడువలెనే, కన్నెత్తి చూడడమ్మా కలనైనగాని, కన్నీరు కావేరి కొలవసుమీ, తలవాకిలి ఇల్లు సుమీ, మనసు విరిచెదరు సుమీ, నాలిముచ్చు, మొగమింత చేసుకొని, దాదు ఫర్యాదేది ?, అరమరలేక, నీ కోపము

కొల్లపోవద్దా, గుసగుసమని, కలకలమని నవ్వి, నోరూరు, పులి పులియైపడి, ఏమో నాటికాయెపోయె, నా మనసు రాయి చేసుకొన్నా, ఒట్టుపెట్టినగాని, నిందకొడి గట్టితివి, కాళ్ళవేళ్ళ బెనుగుచు, వదివేల బాసలుచేసి, పెదవులు తడపుచు, దేవునాన్న కన్నులకొత్తుక, అడుగులకు మడుగులొత్తిన, మోసెల్లు చేసితివి, అక్కరలేవి. కష్టల మాయె, మీరేమైన నార్చేరో తీర్చేరో, చాలుచాలు వదివేలు, చొక్కవడి చల్లినట్లాయె, కానిపోని మాటలుచేత, బుద్ధి చెప్పకుందురా' ఇవి కొన్ని మచ్చుకు మాత్రమే. ఆయా సందర్భాలలో ఈ పలుకుబళ్ళను పరిశీలించినపుడే విజస్థితి, స్వస్వరూవం స్పష్టం కాగలవు.

5. రాయలసీమ భాష : క్షేత్రయ్య పదాల్లో రాయలసీమ వాడుకలో ఉండే భాషా పదాలు ఎడనెడ కన్పిస్తున్నాయి.

'నామీద నెనరుగల్గి నా వారిపలె నుండి
యేమేమో విభునితో నెగబోసిరే
ఆమాట నిజము చేసి యతడిందు రాకున్నాడు
కామాక్షిరో ! మేక వన్నెపులి వంటి చెలులే'

ఇందులో 'విభునితో నెగబోసిరే' అన్నది ఈనాడు గూడ రాయలసీమ పల్లెలలో వినిపించే మాట. 'మేకవన్నె పులివంటి చెలులు' లేనిపోని కల్లిబొల్లి మాటలు చెప్పి 'విభుని' తనకు కాకుండా చేశారట. మొదటే కొంత అనుమానం గల నాయకునకు మరికొన్ని చాడిమాటలు చెప్పి, విభుని అనుమానాన్ని మరింత అధికం చేశారన్న అర్థాన్నిస్తుంది పై ప్రయోగం. మరికొన్ని అలాంటివి. 'బాగాయె' అన్న పలుకుబడి ముందే వివరించబడింది. 'ఫలమేది కద్దు, ఈడకు, ఏమో నాటికాయె, మొన్నటూళ నుండి, కయ్యకుమన్ని, మందుబెట్టి అలవాని నోరుమూసినే, తాళగలవా, ఇదెక్కడి జోలి, పుణ్యమయ్యాని, ఈ ప్రొద్దు మంచి దినము, జారుకొన్నాడు, కద్దాలేదో, దేవునాన, కావలెనమ్మ వానికట్ల, మందుల మారిది, మాయజిల్లి, ఏప్రొద్దు బాయక, గ్రక్కున దానింటికేగిన తడవ, అరులుమరులు చేసి, అడిగితే మీరేమైన నార్చేరో, అసురుసురు మనెను, నీ కోపము కొల్లపోవద్దా, ఆ వేళ తెలియదేమారితి, వంతువేసి, నన్నుంచుకొమ్మని, నేడది చెప్ప నక్కెము గాదు, పైనిండా (ఒళ్ళంతా), చులకన జేసి, వల్లెవాటు వేసి, కలకల నగుచూ (కల

కల నవ్వుతూ)' ఇవన్నీ ఈనాటికీ రాయలసీమలో పల్లెప్రజల వాడుకలో మనం వినవచ్చు. ఇవేగాక ఇంకా ఎన్నో ఇలాంటి ప్రయోగాలు ఎత్తి చూపించవచ్చు. క్షేత్రయ్య వ్రాసింది పదకవిత, ప్రజల భాషలో వ్రాశాడు. కనుకనే ఆనాటి భాష క్షేత్రయ్య పదాల్లో కనిపిస్తూంది.

6. వ్యావహారిక భాష : ఇంకా క్షేత్రయ్య భాషలో వ్యాకరణానికి లొంగని అసాధు రూపాలు సైతం అనేకం కనిపిస్తాయి. ఇలాంటి వ్యావహారిక రూపాలు శృంగార పదాల్లో కనిపించడంలో విప్రతిపత్తి లేదు. కారణం శృంగార పదాల్లో గ్రామ్యోక్తులుండవచ్చు. ఇంతేగాక బహుజనపల్లి సీతారామాచార్యులుగారు, ఆ తరువాత సూర్యరాయాంధ్ర నిఘంటుకారులు క్షేత్రయ్య భాషను ప్రామాణికంగా పరిగణించి ప్రయోగాలు చూపించడం చూడగా క్షేత్రయ్యకు ఎంతటి మహోత్తర స్థానం ఆంధ్ర సాహిత్యంలో ఇచ్చారో అవగతమవుతుంది. ఇందుచేత క్షేత్రయ్య వ్యావహారిక భాషను వాడుక చేశాడని వ్యాకర్తలు, పండితులు ఈసడించుకోపనిలేదు. నిజానికి ఇలాంటి రూపాల్లోనే భాషాతత్త్వం, ఆంధ్ర జాతీయత స్పష్టమవుతాయనడం అసంగతం కాదు. అంటే ప్రజల భాషను ప్రయోగించాడు క్షేత్రయ్య. ఇందుకు మనమెంతగానో గర్వించవలసి ఉంది. కొన్ని ఉదాహరణలను పరిశీలిద్దాం.

'ఏనాటికైనా నీకెమ్మో - విచ్చితి పనికోపమా
ఆ నీని, చప్పరించీని - అవహరించీనా ;
నేనెంతో విన్నవించిన - నేవువినవు వినకున్న
మామ మందువల్లనా - మనసునొవ్వగలేదురా ;

ఇందులో కెమ్మోవిని 'అనీని, చప్పరించీనీ, అవహరించీనీ అవహరించీనా' అనీ నాయిక అంటూంది. ఈ వ్యావహారిక రూపాలకు సరిగా 'అనునా, చప్పరించునా, అని ప్రశ్నార్థక గ్రాంథికరూపాలు వాడితే పై వ్యావహారికరూపాల్లోని స్ఫూర్తి చెడుతుంది. కారణమేమంటే వాటి ప్రయోగంలో నాయికయొక్క అలక్ష్యం, గర్వం, భాసిస్తున్నాయి. ఆ భావస్ఫూర్తి గ్రాంథిక రూపాలవల్ల సాధించడం కష్టం, అందుచేత లోకంలోని వాడుకవలా వాడినప్పుడే ఆ ప్రయోగానికి బలం, భావనిర్భరమైన శక్తి చేకూరి సహృదయాలను రంజింపజేస్తాయి. ఇలాంటివి కోకొల్లలు; 'చింత

చేసేను, అలమాని, అమ్ముకొనీనా, మ్రొక్కేవి, కలపేని, మూలదాచీనా, మళ్ళి, కాన, సేవచేసితే, తీర్చేరు, అందేను, చూచేవు, చెప్పేరు, ఉండమనేరు.

6.1 సంధులు : వతియూరి కరిగేటప్పుడు, వదకింటిలో, వమ్మకించే టంతలో, తాను సేవించు టూడిగమెల్ల, మాటాడేటంతలో, కలిపేటంతలో, నరస మాడేటంతలో, పై కొనేటంతలో, మందగమనను పేరు (మందగమన+అను పేరు), ద్వంద్వసమాసం—పుణ్యపాపము (పుణ్యపాపములు అనడానికి). ఇట్లే అత్తమామ (అత్తమామలు). ఇలాగే కొన్ని అసాధురూపాలు క్షేత్రయ్యపదాల్లో కనిపిస్తున్నాయి. అవి సందర్భోచితంగా ఆ పదాల్లోని రసభావపుష్టి కుపకరిస్తున్నాయని స్పష్టమవు తుంది. పై పదాల్లో కొన్నింటికి అంటే సేన మొదలైనవాటికి గిడుగు సీతాపతిగారు ప్రయోగాలు చూపించారు.

6.2 కొన్ని వింత ప్రయోగాలు : క్షేత్రయ్యపదాల్లో కొంతవరకు అపూర్వంగాను, కొన్ని వింతగాను ప్రయోగాలు క్వచిత్తుగా కనిపిస్తున్నాయి

'వాడివేడి శరములవంటి నా చురుకు మాటలకు
వాడుగాగ దాటుకొనివచ్చె నా విడిదికి.'

ఇందు నాయిక అంటోంది నాయకుని సిగ్గుమాలిన తనాన్నిగూర్చి 'వాడి వేడి శరములవంటి చురుకుమాటలట ! వాడిశరముల మాటలనడం సామాన్యమే కాని వాడితోపాటు వేడిసైతం ఉన్నదట ! అవి మొదటే చురుకుమాటలు వీటికి వాడి, వేడి విశేషణాలను వాడి క్షేత్రయ్య నాయిక మాటల చురుకుదనాన్ని స్పష్టంచేశాడు.

'పొగరుచున్నారు' (పొగరుతో నున్నారు)

'దాగియుండుకొవి' (దాగియుండి)

'కోపము పేయవచ్చున' (కోపగింపవచ్చునా)

'ఆకలాడి' (ఆకలెత్తి)

'వరవా పేయగ' (క్షమింపగ)

'దయవాడవవెవట' (దయగలవాడవవెట)

'పొంచులువివి' (పొంచివినుట)

'పుట్లు' బంగారుపుట్లు అంటే బంగారపు ముద్దలు కావచ్చును. ఈలాంటి ప్రయోగం అంటే బంగారుపుట్లు అనడం రాయలసీమలో ప్రయోగముంది.

ఈ విధంగా కొంత వింతగాను, విశిష్టంగానూ క్షేత్రయ్య ప్రయోగించిన ప్రయోగాలు అతనిభాషా మర్మజ్ఞతకు నిదర్శనం.

## 7. అన్యదేశ్యాలు :

పోతే చివరిగా అన్యదేశ్యాల గూర్చి చెప్పడం అవసరం, దీనితోనే క్షేత్రయ్య పదాల్లో అనంత ముఖాలుగా కనిపించే భాషా వైభవం - సంపూర్ణమైన అవగాహనకు రాగలదు. అన్యభాషా సాహచర్యాలవల్ల ఒక భాష ప్రభావితం కావడం, తప్పా లంగా పరిపాలన విషయంగా నైతేనేమి, సాంస్కృతికంగా నైతేనేమి, అన్యదేశ్య భాషా పదాలు వచ్చి చేరిపోవడం సర్వసామాన్య విషయమే. అదే విధంగానే క్షేత్రయ్య భాషలో అన్యదేశ్యాలు కొన్ని చోటుచేసుకొన్నాయి. క్షేత్రయ్య మధుర, తంజావూరు, గోలకొండలలో ఆశ్రయం పొందినవాడు గనుక ఆ కాలంలో మహమ్మ దీయుల సంపర్కంతో వారి భాషా పదాలు అంటే ఉర్దూ, పార్సీ మొదలైన భాషా పదాలు క్షేత్రయ్య భాషలో చేరినట్లు స్పష్టం కాగలదు. ఇంతకుముందే మనమను కొన్నట్లు ఆయా పదాలు, ప్రయోగాలు సహజంగా భాషలో ఉన్నవేగాని, కావాలని పట్టుపట్టి ప్రయోగించినవికావు. మచ్చునకు కొన్ని 'బుక్కా, దిమాకు, చాపి, వరాలు, పీమాటి, దాదుఫిర్యాదు, బురుసు, రుమాలు, తురాయి, పటావి, బుట్టాలరవ పెల్లా, పావడ, తంబూర, జాగా, పావాలు, దట్టి, పైకాణి, కస్తు, పిస్తు, గొజ్జంగి, వరవా (ఫర్వా) ఇవికొన్ని ఉదాహరణకొరకు మాత్రమే, ఈపదాలు క్షేత్రయ్యభాషలో పొందుచేసుకొని చేరిపోయి, తెలుగువదాలో అన్నట్లు ఇమిడిపోయాయి. ఇలాగే క్షేత్రయ్య భాషావైభవం సముచితమై అతని తెనుగుభాషా మర్మజ్ఞత మనకు స్పష్ట మవుతూంది.



# సారంగపాణి పదాలు - భాషా వైభవం

1. మహాకవి తిక్కన తరువాత తెనుగుతేటని, తియ్యదనాన్ని, బలాన్ని, మర్మాన్ని తెలుసుకొన్న పదకవితా చక్రవర్తి క్షేత్రయ్య. ఈ భాషా విషయంలో క్షేత్రయ్య పక్కనే నిలువగలవాడు సారంగపాణి. క్షేత్రయ్య తన పదాల్లో సందర్భోచితంగా వ్యావహారిక రూపాన్ని వాడడంతో సంతృప్తిపడ్డాడు. కాని సారంగపాణి వ్యావహారిక రూపాన్ని వాడడమేగాక ప్రత్యేకంగా మూడో భాగంలో జాతీయ పదాల్లో పామర ప్రజల వాడుకభాషని ప్రయోగించడం విశేషం. ఇది జానపదుల వ్యవహారానికి తగినరీతిలో గూడా వుంది.

తేటతెలుగు సారంగపాణి పదాలన్నిటా మనకు కనిపిస్తుంది. మన మనస్సులను అలరిస్తుంది ఆనందాన్నిస్తుంది. అక్కడక్కడా సంస్కృత సమాసయుత రచన ఉంది. కాని అందులోని సమాసాలు నాతికఠినమై, దూరాన్వయ రహితమై ఉండడం సారంగపాణి భాషలోని విశిష్టగుణం. 'వరకన్యా తిలకమే.... ....కలయు మిక రతిని' (పదం-7) లో సమాసాలున్నా, శ్లేషాత్మకమై, చమత్కారయుతమై సారంగపాణికి సంస్కృతాంధ్ర భాషలలోగల ఉభయ భాషా పాండిత్యాన్ని ప్రకటిస్తున్నాయి. తేట తెలుగుదనానికి ఉదాహరణ :

'పల్లవి : అట్లాగె కావలె దానికి
హైళ్ళా వాసు నాడు

అను....: కొల్లాటిందెదుగవచె వేణు
గోపాలుని పిలువ వద్దంటె ॥ అ ॥

వద్దికివేయమని రూకలు
గుద్దతో గట్టియ్యగానే
పొద్దు వెత్తివవేసి యురికె
జిద్దు మొన్నటితోనే విడిచె ॥ అ ॥

కలభూషణములన్నీ ముడిచి
తలమాటున వుంచుకుంటె
మెళకువగా అంటుకొనీ జరిగె
.... .... .... .... .... .... ....'

ఇతని భాష సర్వశోభస్కరంగా ఉంటుంది. సారంగపాణి పదాల్లో చక్కటి తెలుగు పలుకుబళ్ళు, సామెతలు సందర్భోచితంగా ఉండి అతని పదాలకు శోభని చేకూర్చాయి అన్యదేశ్యాలు సైతం ఈతని పదాల్లో చోటుచేసుకొన్నాయి సంధి సమానరీతుల్ని సైతం ఇందులో మనం గమనించవచ్చు.

1.1. పలుకుబళ్ళు : పలుకుబళ్ళు లేక నుడికారాలు అన్నవి భాషా వైశిష్ట్యాన్ని, స్వభావాన్ని, స్వాతంత్ర్యాన్ని ప్రకటించేవిగా ఉంటాయి. తెలుగు భాషా స్వభావాన్ని బాగా గుర్తించిన సారంగపాణి తన పదాల్లో పలుకబళ్ళని చక్కగా ప్రయోగించాడు

'అక్కరలేని కాపురమాయె (54)
అడుగులకు మడుగులొత్తేనే (30)
అడుగులోనే అరవైయారు గుణాలైతే (35)
అడుగులోనే వేయి గుణములైతే (55)
అర్థమాజ్ఞ లేదు (91)
అన్యాయాని కొడిగట్టు (28)
అసురుసు రసుకుంటే (52)' మొదలైనవి.

1.2 సామెతలు : కవితలోని సామెతలు పాఠకులకు చక్కటి ఆమెతలు. పైగా జాతి స్వభావాన్ని అవి స్పష్టంచేస్తూ కవికి భాషపైగల అధికారాన్ని అభివ్యక్తం చేస్తాయి. ఇలాంటి సామెతలు సారంగపాణి పదకవిత నిండా మనోజ్ఞమై ఆనందాపాదిగా ఉన్నాయి.

'అందరాని పండ్లకాశించినట్లాయె (17)

అద్దికొంప వంటిది ఈదేహమ్మనిత్యమే (190)

అరవై యేండ్లు జెల్లితే అర్లుమర్లు గాదటవే (124)' మొదలైనవి అనేకం.

2. ధ్వనుల మార్పులు :

2.1 సారంగపాణి పదాల్లో చాలవరకు అచ్చు 'ఒ'కు బదులు హల్లు 'వ' వాడడం కనిపిస్తుకది. వ<ఒ

వకరి<ఒకరి (కడవదాట విచ్చునా వకరిమాట సాగనిచ్చునా ?)

2.2 'ఏ' కు బదులు 'య' వాడుక అక్కడక్కడా కనిపిస్తుంది. య<ఎ

యడబాయనంటివి<ఎడబాయనంటివి (యేనాటికీ యడబాయనంటివి)

2.3 లు, ల, వలు పరమైనప్పుడు 'ము' వర్ణకలోపం, పూర్వాచ్చుకు దీర్ఘత చూడవచ్చు. పదాలు, నమస్కారాలు, ప్రసాపాలాయె, రత్నాలు, శయాన, సంబా ళాలు, దంతాన, చిత్రానికి, పటానికి, సత్యానికి, భాగ్యానికి

2.5 పదమధ్య స్వరలోపం :

కిర్‌జడ<కీలుజడ, చట్రాయి<చట్టురాయి, కత్రించి<కత్తిరించి, బొట్టవేలు<బొటనవేలు, పట్నము<పట్టణము, కూట్నీళ్ళు<కూటినీళ్లు, ఇంట్లోనె<ఇంటిలోనె, పల్వరున<పలువరున.

2.5 స్వరభక్తి :

చెరియలు<చర్యలు, మరియాద<మర్యాద, దరిశనము<దర్శనము, ధరమ<ధర్మ

2.6 అల్పప్రాణత, మహాప్రాణత :

ఘట్టి<గట్టి, కశేభారం<కళేబరము, సుద్ధి<సుద్ది, భిన్నసరము<బిన్నసరము, ఝుడుతునా < జడుతునా.

2.7 కృతక ప్రామాణికత :

హారతి<ఆరతి, వేట<ఏట, మనుషా<మనసా, ద్రేగాము<దేహము, కళే భారం<కళేబరము, హెచ్చరిక<ఎచ్చరిక.

2.8 పదాది తాలవ్యవ్యంజనాల మీది అ,ఎ గా మారడం.

చెంద్రుడవు<చంద్రుడవు, చెరియలు<చరియలు, శెయ్యా<శయ్యా, జెడ< జడ, ఇతరత్రా, పరిమెళవతి<పరిమళవతి.

2.9 అయి–ఐ. అవు–ఔ ల వినిమయం.

చైసాతురు, నాచై పట్టుకొని, చైమాత్రము.
అవు<ఔ, చవుశీతి<చౌశీతి.

2.10 అద్విరుక్తంగా ప్రయోగం.

నినే నమ్మినావని < నిన్నే నమ్మినావని (63)
గోపాల రమని < గోపాల రమ్మని.

2.11 'హ'–'గ' గా మారిన రూపాలు : గ<హ.

ఊగ దెలియని < ఊహ తెలియని, బగుమానం < బహుమానం.

2.12 చ–స, చ–శ, స–శ ల వినిమయం.

రచ్చ శాయకంచె, ఈతసావ, సనోరము (శనివారము) శిన్నోడడిగేశల్కి, శిపొమ్మంటివి, యంత శెప్పిన, పాతశిరుందెంటివి, శేతిలో బోసి, ననుసూశి, మట్టి సట్టెంటిది.

2.13 హకారాది పదాలు : తెలుగులో దేశ్యేతర పదాల్లో మాత్రమే కనిపిస్తాయి.*

హొంతకారి, హౌసుగా నిలుచుండి, హేసమెత్తురు, హద్దు హొయలు, హాయి, హూణుల దరబారని.

2.14 పదమధ్యంలో 'ద'కు బదులు 'ట' రావటం.

* ప్రొఫెసర్ తూమాటి దొణప్ప : తెలుగు హరికథా సర్వస్వం. పు. 280.

కావటి కుండలు, ఏర్పటినావచే

3. సంధులు : సారంగపాణి తన పదాల్లో వ్యావహారిక భాషని, పామర ప్రజల వాడుకభాషని ప్రయోగించడంవల్ల వ్యాకరణానికి ఒదగనిరూపాలు ఇందున్నాయి.

3.1 తెలుగు సంధి.

3.1.1 అత్వసంధి : అ+అ = అ

వారవనిత+అంటె=వారవనితంటె

అ+ఆ=ఆ — కుదువబెట్టిన+అతిగె=కుదువబెట్టినాతిగె.

3.1.2 ఇత్వసంధి : ఇ+అ=అ

చిన్ననాటి+అభిమానము=చిన్ననాటభిమానము

ఇ+అ=ఆ — పోకిరి+ఆటకు=పోకిరాటకు

3.1.3 ద్రుతముమీది యడాగమం :

తెలుపుదు యీవింత, నన్ను యేనాటి యెడబాయని,

సరసాక్షితో యట్లా, దారమువలె యెంతజేపె,

కళపై నుగాగమం :– ఇయ్యక నుండె, లేకను.

ద్రుతముమీద వుగాగమం :– తాకట్టు వుంగరాలు, వచ్చిగ వుంటె.

3.1.4 ఉత్తరపదాది 'వ' లోపం, ఒ, ఎ లు వచ్చి సంధి గలగడం తరచు కనిపిస్తుంది.

ఇంటెలుపున (<ఇంటి+వెలుపున < ఇంటి వెడలుపున)

మంచోడు (<మంచి+వాడు)

మంగలోళ్లు (<మంగలి+వాళ్లు)

మట్టి సట్టెంటిది (<మట్టిచట్టి+వంటిది)

3.1.5 ఆకు పరమైనపుడు 'పగాగమం' అవుతుంది.

సున్నపాకు (<సున్నము+ఆకు)

4. సమాసాలు : సారంగపాణి భాషలో వైరి సమాసం ప్రయోగం అధికం. అయినా ఇతర సమాసాలు గూడ అందు లేకపోలేదు.

దేశ్యము+దేశ్యము :– సుంతసేపు, తొత్రెనోరు, నల్లపూస.

దేశ్యము+సంస్కృతము :– నిండు కౌగిలి, మడ్డి శరీరము.

సంస్కృతము+సంస్కృతము :– సంపూర్ణ చంద్రోదయము, దివ్య పరిమళ గంధము, వినోదాంజనంబు, మందారవనము, కామినీ జనపాంచాల పంచశరుడు, కేళిప్రౌఢి, బహుగతులు, జలపాత్ర.

సంస్కృతము+దేశ్యము (ఇదే వైరిసమాసం) :– శుద్ధ మడ్డిమాను, మహాజడగొండి, శృంగారతోట, గ్రామలెక్క, రాజఠీవి, దేశద్రిమ్మరి, గర్వితొత్తు.

సంస్కృతము+అన్యదేశ్యము :– పరగంజాయ, నిత్యబత్యాలు.

5. క్రియలు : సారంగపాణి పదాల్లో మొదటి భాగంలోని శృంగార పదాల్లోను, చతుర్థ భాగంలోని కీర్తనల్లోను వ్యాకరణబద్ధమైన క్రియా రూపం గోచరిస్తుంది. ద్వితీయ భాగంలోని దేశీయ పదాల్లో శిష్టవ్యావహారికాన్ని, తృతీయ భాగంలోని ప్రజల వాడుకభాషని తదనుగుణమైన క్రియల్ని ప్రయోగించినట్లు స్పష్టం.

5.1 ఇచ్చు మున్నగు 'చు' వర్ణాంత, ధాతువులు, చేయు మొదలైన 'యు' వర్ణాంత ధాతువుల ఆద్యక్షరం మీది భాగానికి 'స్త' ఆదేశం అవుతుంది.

ఇస్తివి, చూస్తివి, చేస్తివి, తీస్తివి, వేస్తివి.

5.2 చేదర్థకంలో – వచ్చితే<వచ్చిన, తెస్తే<తెచ్చిన, ఉంగరాలిస్తే<ఉంగరాలిచ్చిన.

5.3 ఉభయ ప్రార్థనలో — వీణె విందామంటే (125)
కూడి యుందాము (134)
చూతామనుచు (381)

5.4 చేతురు, కోతురు లాంటి రూపాల్ని లాక్షణికులంగీకరించలేదు. ఇలాంటివెన్నో ఉన్నాయి.

నెయ్యము పేతుర, లంగము జేతురు, పదిపేతురు.

5.5 ఇచ్చునకు సర్వంబున కీయగు. (బా. క్రి.)

ఈ లక్షణానుగుణమైన ప్రయోగాలున్నాయి.

కౌగిలీర, ఉత్తరమీక.

దీని విరుద్ధ రూపాలనేకం.

ఇంతికీయలేక, రానీయకే, ఇచ్చిన మంచిదే ఇవకున్నా మంచిదే.

5 6 సాహాయ్యక క్రియగా కొనుధాతువనుప్రయుక్తమైనపుడు క – కో – పదాంశాలు కనిపిస్తాయి.

పిలుచుక, ఏలుకోర, గురుతిచ్చెను కోర.

5.7 ధాత్వాదుల కనుప్రయుక్తమయినపుడు 'ప' 'వ'కారాది ధాతువు తొలి హల్లు లోపించిన ప్రయోగాలున్నాయి.

భ్రమలుట్టె (<భ్రమలు+పుట్టె)

లేసొచ్చేవా (<లేచి+వచ్చేవా)

ఈదెంబడెల్లొచ్చె (<వీధి+వెంబడి+వెళ్ళి+వచ్చె)

ఇసికేస్తే (<ఇసుక+వేస్తే)

చుట్టొచ్చిరి (<చుట్టి+వచ్చిరి)

5.8 బోపేసితివట (13)

భోంచేసి (88) భోం+చేసి<బోనం<ప్రాకృతభోఅ.

భోయణ < (సంస్కృత భోజన)*

* ప్రొఫెసర్ తూమాటి దోణప్ప — తెలుగు హరికథా సర్వస్వం. పుట-329.

దీనికి పామరుల వాడుకలో 'దోసేసితివట' రూపమేర్పడింది.

5.9 తద్ధర్మార్థక క్రియా విశేషణాలు :

చేసేటంతలో (టుగాగమ), చేరేటందుకు (183), వచ్చేటందుకు (74).

6. వింత ప్రయోగాలు (విలక్షణ ప్రయోగాలు) :

కొన్ని విలక్షణ ప్రయోగాలు సారంగపాణి పదాల్లో కనిపిస్తాయి.

కోపాలు చేసేనే (10) (కోపగించుకొనేనే),

చెలులు మందగా గూర్చేవు (తిర్యక్కుల సమూహానికి 'మంద' అని వాడటం తద్దు),

చులకతనము (చులకన), ఎంత ప్రాణదానవే (89),

తసకారమసే (109) < తిస్కారమసే < తిరస్కారమసే,

గాంధారితనాలు (116), మౌళి (118),

కోరుకి (అనంతపురపు వాడుక), కొలుకి (ఉత్తర సర్కారులోని వాడుక),

తాటాకు వ్రాసేయమని (131) (ఉత్తరం రాసేయమనడానికి),

బయసారి పొయ్యేవు (132) బయిసి < బగిసి,

గర్వితొత్తు (135) — తిట్టు,

పొంచులు విని (193) పొంచి వినడం (ఇది క్షేత్రయ్యలోనూ ఉంది),

శిక్షీకరించు (శిక్షించు అనడానికి బదులు),

వినికిచేసే (వినిపించే),

బంగరు గెట్లు (15) బంగారు దిమ్మెలు (క్షేత్రయ్య వాడాడు)

7. అన్యదేశ్యాలు (Loan Words) :

సారంగపాణి సమకాలికంగా వాడుకలో ఉన్న అన్యదేశ్య పదాల్ని ప్రయోగించడం సహజమే ఇలాంటి పదాలు అనేకం.

7.1 అరబ్బీ, ఉర్దూ, పారశీ, హిందీ :— అత్తరు, అరే, అర్జీ,

కరుచూ (<ఖర్చు), కుళ్ళాయి, కొజ్జా, కొత్వాల్‌గిరి, ఖాసా, ఖుల్‌దారోగా, చీటి, జముఖానా, జాబులు, జేబు, ఝూడజేసి, తాజా, తేవణి, తంబూరా, తురుష్కులు, దర్బారు, దివాలెత్తు, ధగిడీ, పక్కా, పాగ/గా, పావడా, పైజారు, బత్యాలు, బాపురే, బుక్కా, బుతేదారి, మహలు, రాజీ, (నీ యింటికి) రాం రాం, రూమాలు, లష్కరు, వరహా, శాబాసు, శాలువా, శీనా, సంబళాలు, సదరు, సలాము, స్వారి, సుబేదారుడు.

7.2 కన్నడం : బీగ(మాయె) హద్దు, హాయి, హౌసు.

7.3 తమిళం : తిరు (వీధి), తిరు (వీసము), నంబి, పిళ్ళ (పిళ్ళారియ వలె).

8. వ్యావహారిక భాష : సందర్భోచితంగా ఇతః పూర్వమే వ్యావహారిక భాషను స్పృశించడం జరిగింది. సారంగపాణి పదాల్లో వ్యావహారిక భాష ఎలా ఒదిగి ఆ పదాలకే ఎలా వాసివన్నె దెచ్చిపెట్టిందో పరిశీలిద్దాం

8.1 సారంగపాణి పదాలు నాలుగు భాగాలుగా ఉన్నాయి. అందులో ప్రథమ, చతుర్థ భాగాల్లోని శృంగార పదాలు, కీర్తనలు చాలావరకు లక్షణయుక్తంగాను, ద్వితీయ, తృతీయ భాగాల్లోని దేశీయ జాతీయ పదాలు శిష్టశిష్టేతర వ్యావహారిక రూపంలో ఉన్నాయి. అయినా శృంగార పదాల్లోను, కీర్తనల్లోను, వ్యావహారిక రూపాలు లేకపోలేదు. శృంగార పదాలు గ్రామ్యోక్తియుక్తంగా ఉండవచ్చు

కానీ వైరాగ్య పదాలు అలాకాక 'అగ్రామ్యరమ్య విష్ణుచరితోదారమై' ఉండడం అవసరం. వీటినే ఆధ్యాత్మిక పదాలంటారు. అన్నమయ్య ఈ రెండు విధాలైన పదాల్ని రచించాడు. అదేరీతిని సారంగపాణి సైతం ప్రథమ భాగంలో శృంగార పదాల్ని, చతుర్థ భాగంలో కీర్తనల్ని రచించాడు. ఇందులో అక్కడక్కడ వ్యావహారిక రూపాలుండి సహజంగా ఆ పదాలు మనోజ్ఞమై రసభావపుష్టికి కారణభూతమై ఒప్పుతున్నాయి.

ఇంతకంతే ద్వితీయ భాగంలోని దేశీయ పదాలు శృంగార పదాలే అయినా అవి దేశీయ పదాల నామకరణం చేయబడి ప్రజలకు మరీ సన్నిహితంగా ఉన్నట్లు రచించబడి ఉండడంవల్ల వాటిలో శిష్ట వ్యావహారికం కనిపిస్తుంది.

8 2 రాయలసీమ వ్యావహారికం :

సారంగపాణి పదాల్లోని భాష ప్రధానంగా రాయలసీమ వ్యావహారికం. ప్రత్యేకించి చిత్తూరు మాండలికం. అయినా తదితర మాండలికాలు– అంటే రాయలసీమకంతా సమానమైనవి లేకపోలేదు పూర్వోక్తమైనట్లు తృతీయ భాగంలోని జాతీయ పదాలు రాయలసీమకు, ముఖ్యంగా చిత్తూరుకు సంబంధించినవి. పామర జనోచితమైన వాడుక భాషని సారంగపాణి ప్రయోగించాడు :

ఒక ఉదాహరణ :

పల్లవి : అగ్గి తిరుణాలంట – అజ్ఞాని కతలంట
అవురా యెంత సోద్దెమే
భారతకత – ఔర యెన్నిన్నింతలే

అ ప. : సుగ్గిజయము దీని సుట్టు బలాదూరు
అగ్గురోరపు అయ్యోర్నడిగే నీసొచ్చిగ ॥ అ ॥

రాయలసీమ సామాన్య జనుల వాడుక రూపాలెన్నో ఇందున్నాయి. సానాదించుందంట, ఈన్నే పొద్దెక్కానే, యీడేడుండాదెంటే, కోణ్ణికొండ పోతే కొందురే వొగురైన, యీసుల్లెగ్గుపే, మబుగు శావలాడ మస్తంటనె, అలసొచ్చే తల్కిడ, మేదోల్లశిన్నెంగు మెట్టెలకంటొచ్చి, పదిదోచజుతినో రెండుకొవి, అడ నీల్లు దాగి అగ్గె లేసుకుకెత్తి, ఇవన్నీ పామరుల వాడుకలో ఈనాడున్నాయంటే ఈ భాష ఎంత బలమైందో స్పష్టమవుతుంది మరికొన్ని వాడుకరూపాలు.

సరిప్రొద్దుకాడ (11), పప్పుశీక (29), డిగ్గున (30), బిగ్గెకుయ్యవద్దు (194), కణజాలామె (83), బొబ్బుడలు (117), పచుష (120) ఒక టోకి, సరకాయింటితివో (131), ఒక ప్రొద్దు (132) శానా మద్దిశరీరము (136), నడి

మద్దెపు, అరుచోద్యం (146), వొకరితో సెప్పకనేరెయ్యి (147), కొరకొగ్గింజలే (148), శినో్ఁడడిగేతల్కి, యెంతసెప్పిన యినవు (151), సీయినోసమగ్గిబడ, శానే రా కల్లాలకు దీసపోయి తైదలు వొణ్ణించ (151), యదబడు (155), చాలు చాలై ఎందట (124), వుండింది వండింది (140), మాట్లాదేకొద్ది (125), ఇచ్చే లేదరూక (151) మొదలైన ఈ రూపాలు ఈనాడు మన పల్లెటూళ్ళలో, పామరుల నోళ్ళ నుంచి వినవచ్చు. ఇది ఈనాడు బ్రతికి బట్టగట్టిన భాష. పూర్వోక్తమైనట్లు ఇది రాయలసీమ వ్యావహారికమే అయినా ప్రత్యేకించి చిత్తూరు మాండలికం అనడమే సముచితం. అయినా అనంతపురం మండలంలోను ఈ రూపాలన్నీ ఈనాడు వివి పిస్తూనే ఉంటాయి.

9. పై పరిశీలనవల్ల సారంగపాణి పండిత భాషనేగాక పామరుల వ్యావహారిక భాషను కూడా ప్రయోగించాడని స్పష్టమైంది. తాను ఆస్థాన విద్వాంసుడైనా సామాన్య జనసన్నిహితంగా ఉండినట్లు సువిదితమైంది. కనుకనే అతని భాష ప్రజల భాష, అతడు ప్రజాకవి.



# వేమన పద్యాలు - రాయలసీమ మాండలికం

1 "Vemana is a poet of Western Andhra the moumetainous tract which being less accessible than the coastal to influences from the north, was less Aryanised, and retained to a greater degree its robust independence of thought and spirit. Sanskrit culture had not perwade there to the same extent as in the Circars, and we had, therefore, fewer translations more originisations. Vemana was a villager by birth. And if we could refer to the caste of a man who had discarded caste, a Reddy ".[1] ఇవి వేమననుగూర్చిన కట్టమంచి రామలింగారెడ్డిగారి మాటలు ఆర్యుల ప్రభావానికి అంతగాలొంగని, తన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకొన్న ప్రాంతానికి చెందినవాడు వేమన; ఒక పల్లీయుడు, కులాన్ని తిరస్కరించిన రెడ్డి కులస్థుడు. ఇలాంటి ఈతని ప్రదేశం సర్కారు జిల్లాల్లాగా చాలా వరకు సంస్కృత ప్రభావానికి గురికాలేదు. అతని భాషకొక ప్రత్యేకత ఉంది. సి. పి. బ్రౌన్ మొదలు అనేకుల ప్రకారం ఇతడు రాయలసీమలోని కడప కర్నూలు జిల్లాలో నివసించినట్లు తన బోధనలు కొనసాగించినట్లు తెలుస్తుంది. ఈ విషయం గట్టిగా సమర్థించి స్థాపించినవారు రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు. వారి నిర్ణయానికి రావడానికి మూడు కారణాలు చూపించారు. 1. జనశ్రుతి, 2. తమ పర్యటన, దాని మూలంగా వారు తెలుసుకొన్న అనేక విషయాలు, 3. ఇంతకంటే ముఖ్యంగా ప్రత్యక్ష ప్రమాణమైన వేమన పద్యాల్లోని రాయలసీమలో వారి కాలానికేగాక ఈనాటికీ వాడుకలో ఉన్న పలుకుబళ్ళు, నుడికారాలు, పదాలు, పదబంధాలు, క్రియాపదాలు మొదలైన శబ్దజాలాన్ని చూపించారు. పై పెచ్చు ఆ ప్రాంతంలో కర్ణాటకుల మూలంగా వ్యాప్తిచెంది వేమనకాలం నాటికి క్షీణదశలోకి వచ్చిన లింగాయతమతం, ఈ మతంవల్ల కొనసాగిన బసివి పద్ధతిని చక్కగా వర్ణించారు[2] అంటే వేమన

1. V.R. Narla (Ed) : Vemana through Western eyes-Appendix-II — A Radio talk by C.R. Reddy, Madras 1950

2. వేమన : వేమన కాలదేశములు పు. 22-43

రాయలసీమకు చెందినవాడని చెప్పడానికి అతని పద్యాల్లోని భాషలోని శబ్దజాలం ఎక్కువగా ఆ ప్రాంతానికి చెందింది కావడమే. వేరేకాదు. వేమన పద్యాల్లోని రాయలసీమ వ్యావహారికాల్నిగూర్చి తెలుసుకొనేముందే, అతని కవితలోని భాషా స్థితిని మొదట చవిచూడడం అవసరం.

2. "He is a poet of nature and natural poet "[3] వేమన ప్రకృతి కవి మాత్రమే కాదు. సహజకవి కూడా. కట్టమంచివారి ఈ నిర్ణయం అక్షరసత్యం. పేరు ప్రఖ్యాతులకోసం కానీ, ధనధాన్యాలు, మడులు మాన్యాలు సంపాదించడం కోసంకానీ కవిత చెప్పలేదు. తనకాలంలో సమాజంలోని చెడుగులనే చీడపురుగుల్ని చంపడానికి, మతంపేర కొనసాగుతూన్న మౌఢ్యాన్ని, ఆచారాలపేర జరుగుతున్న అనాచారాల్ని ఖండించడానికి కవితాఖడ్గాన్ని ప్రయోగించినవాడు. తాను పండితుడుకాడు. పండితులకోసం తాను కవిత చెప్పలేదు సామాన్య ప్రజలకోసం సులభంగా అర్థమయ్యేరీతిలో సరళభాషలో కవితచెప్పడం విశేషం. అందులో ఎక్కడో తప్ప అర్థకాఠిన్యం గానీ, దూరాన్వయంగానీ కల్పించడు. సులభమై సర్వజన సుగ్రాహ్యమైఉండే భాషలో చెప్పడం మరీ విశేషం. సూటిగా హృదయానికి హత్తుకొనేట్టు జీవితంలోని సారాన్నిచెప్పడం విశేషాల్లోని విశేషం అందుకే వేమన కవిత అరటిపండు ఒలిచి నోటికందించినట్లు, ద్రాక్షాసవం నింపిన చషకం పెదాలకాని అనించినట్లు మండువేసవిలో మిరియం యాలక్కాయలపొడి కలిపిన చల్లని పులకండ పానకం ఇచ్చినట్లు తియ్యనై, మధురమంజులమై ఆనందాన్నిచ్చే కవిత వేమన కవిత.

సరళమైన మామూలుభాషలో సరళమైనశైలిలో ఎంతో భావగాంభీర్యంగా చెప్పడం వేమనకు మాత్రమే చేతనైంది.

"చెట్టు చేమగొట్టి చుట్టుగోడలబెట్టి
యట్టునట్టు పెద్దయిల్లుగట్టి
మిట్టిపడును నరుడు మీది చేటెరుగక
విశ్వదాభిరామ వినురవేమ" (వేమన పద్యాలు 86–163)

3. పై మొదటి సూచికలోనిదే.

చెప్పదలచుకొన్న భావాన్ని చక్కగా, సులభంగా, వ్యక్తీకరించేరు:

"ఎరుక మరువలేక కర్మము గట్టగలేక
వెరవులేక విద్య నొరయలేక
వెతలలేని వాని నడుపను గందురో
విశ్వదాభిరామ వినురవేమ" (వే వ. 69-46)

ఎంత గహనమైన విషయాన్నైనా చక్కటి తెలుగుభాషలో సున్నితంగా చెప్పేరీతి:

"కొండరేడు మామ కొండ కూతురయాలు
కొంతయిల్లు పసిడి కొండవిల్లు
కొండవంటి దొరవు కుంటెన నడతురా
విశ్వదాభిరామ వినురవేమ" (వే. వ. 94-222)

ఆనాడు రాజులనుద్దేశించి బహుచమత్కారంగా సున్నితమైన అధిక్షేపణ (satire) చేస్తూ గావించిన వ్యంగ్యచిత్రణ :

"ప్రభువు కోతియైన ప్రగ్గడల్ పందులు
సైనికుండు వక్క సేన వసులు
యేన్గు లశ్వచయము లెలుకలు పిల్లులు
విశ్వదాభిరామ వినురవేమ" (వే. వ. 139-[illegible]7)

మిక్కిలి తక్కువ తెలుగుమాటల్లో భగవంతునిగూర్చి తాత్వికంగా చెప్పిన మాటలు గావు, పసిడిమూటలు; జ్ఞానోదయానికి చక్కటి బాటలు,

లేదు లేదనివను లేదు లేనేలేదు
కాదు కాదన్న కానేకాదు
తోదు తోదనిన్ను తోదవేతో దాను
విశ్వదాభిరామ వినురవేమ" (వే. వ. 132-10)

ఇలాగా చక్కగా చిక్కగా భావబంధురంగా చెప్పిన తెలుగుకవి మరొక్కడు లేడంటే ఆశ్చర్యంలేదు. వేమన పద్యాల్లోని భాషలో రాయలసీమ మాండలికాలు ఎక్కువగా ఉండడం ఆ ప్రదేశంలో ఆతనికున్న అనుబంధాన్ని స్పష్టంచేస్తుంది.

3.0 రాయలసీమలోని వేమనకుగల సంబంధాన్ని ప్రత్యక్ష ప్రమాణంతో నిరూపించినవారు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారు. ఆ సందర్భంలో కొన్ని పదాల్ని ఉదాహరించి, అవి రాయలసీమలోని వాడుకపదాలని వివరించారు[4]. ఈ విషయాన్ని ఉట్టంకించినా వివరాలలోకి వెళ్ళనవారుకారు డాక్టరు గంధం అప్పారావుగారు[5]

3.1 రాళ్ళపల్లి వారి వాదాన్ని స్వీకరించిన డా॥ ఎన్. గోపిగారు "రాళ్ళ పల్లి వారిచ్చిన 19 పదాల్లో కొన్నిపదాలు తెలంగాణా సర్కారుల్లోకూడా వాడుకలో వున్నాయి అయితే వాటి అర్థాల్లో కొంత ఛాయా భేదంకూడ కనిపిస్తుంది"_అని పేర్కొని వాటిలో కొన్నిటికి నైఘంటికార్థాల్ని ఇవ్వడం జరిగింది[6] రాళ్ళపల్లి వారిచ్చిన పదాలు 19 అని పేర్కొన్నారు గోపిగారు పొరపాటున. రాయలసీమలో వాడుకలోఉన్న పదాలని పదిహేడింటిని మాత్రం పేర్కొన్నారు రాళ్ళపల్లివారు. ఆ వెనుక వీనికితోడు "కుంక (1033), చెంబడి (880), ఊంక (549) వంటివి, ఈదేశమున వాడుకలేని పదములు అపురూపముగా గలవుగాని, యవి వేమనవంటి దేశద్రిమ్మరికి వచ్చుట వింతకాదు" అని పేర్కొన్నారు.[7] ఇక్కడ ఈ దేశమున అంటే రాయలసీమలో అని అర్థం. అక్కడ వాడుకలోలేవి 'కుంక, చెంబడి, ఊంక' అనే మూడుపదాలు వేమనపద్యాల్లో ఉన్నాయనీ, అవి అపురూప ప్రయోగాలనీ. అయితే వేమన దేశద్రిమ్మరి గనుక పలుతావుల తిరిగి ఉండడంవల్ల ఆతని పద్యాల్లో అవి కనిపిస్తున్నాయనీ అర్థం. మూడింటిని డా॥ గోపిగారు రాయలసీమలోని వాడుక పదాలుగానే గ్రహించడం సముచితంకాదు. వారిచ్చిన అర్థాల వివరణ ఇది.

కుంక : విధవ అనే అర్థంలో వేమన్న వాడాడు "కాంత కుంకయైన".

చెంబడి : చెంబట్టుక అని తెలంగాణాలోఉంది.

---

4. పై రెండో సూచికలోనిదే పుటలు 40–43.

5. వేమన–సర్వజ్ఞులు (తులనాత్మక పరిశీలన) పు 20–21.

6. డా॥ ఎన్. గోపి : ప్రజాకవి వేమన : పు 137–140

7. వేమన పుట 41

ఊక : సర్కారుల్లో కూడ ఇదేరూపంలో ఉంది. తెలంగాణాలో ఉసుక అంటారు.

కుంక అంటే బాలవిధవ అని నిఘంటువుల్లో ఉంది. 'పోరా కుంక' అంటే 'పోరా వెధవ' అని సర్కారుల్లోని వ్యవహారం. చెంబడికి తెలంగాణాలోని వాడుక 'చెంబట్టుక' అనే అర్థంలోఉందని డా॥ గోపిగారు. కానీ చెంబడి అంటే నాపికుడని 'శబ్దార్థచంద్రిక' నిఘంటువులోని అర్థం. ఊక అంటే పొట్టుఅనే అర్థంలో వాడబడుతూంది. తక్కిన పదాలకు ఆయా సందర్భాల్లో నా వివరణలోనే విశదీకరించడానికి యత్నిస్తాను.

4.0 రాయలసీమ మాండలికం : తెలుగు గ్రాంథికభాషలో అట్టే భేదాలులేని మాట వాస్తవం. అయితే వ్యావహారికభాషలో అనేక భేదాలు గోచరిస్తున్నా ప్రధానంగా మూడు మాండలికాలు ఈనాడు కనిపిస్తున్నాయి. అవి తెలంగాణా, రాయలసీమ, కోస్తాప్రాంతాలకు సంబంధించిన మాండలికాలు. అనే విషయం మనకు తెలిసినదే.

అయితే ఈనాడు విశాలాంధ్రంలో నివసించే ఈనాటి మన వ్యవహారంలోనే ఇన్ని భేదాలున్నాయంటే వేమన తిరిగి, ఎక్కువగా నివసించిన రాయలసీమ ప్రాంతంలోని వాడుకభాష ఉండడంలో ఆశ్చర్యంలేదు

4.1 వేమన పద్యాల్లోని రాయలసీమ మాండలిక పదాలనిగూర్చి పరిశీలిద్దాం. ఈ సందర్భంలో ఒక విషయం. వేమన పై పరిశోధనచేసి డాక్టరేటు పట్టంపొందిన డా॥ గోపిగారు వేమన భాషనుగూర్చి ముఖ్యంగా–రాయలసీమ మాండలికాల్నిగూర్చి ఎంతో వివరించవలసి ఉండగావారు రాళ్ళపల్లి వారు ఉదాహరించిన మాటల్ని పేర్కొని మరి కొన్నింటిని మాత్రం తమగ్రంథంలో ఉదాహరించి ఉండడంవల్ల నాయీ పని సులభతరమైందిగా భావిస్తున్నాను. నా యీ పరిశీలనకు 1980 లో యోగివేమన తెలుగు విజ్ఞానకేంద్రం వారు శ్రీ బంగోరే సంపాదకత్వంలో 1839 నాటి సి పి. బ్రౌన్ సంకలనాన్ననుసరించి పునర్ముద్రించిన వేమన పద్యాలు గ్రంథం ఆధారమైంది. అందులోని పదాలతో నా యీ వ్యాసంలోని పరిశీలనను పరిమితం చేసుకొన్నాను.

---

8. పై ఆరో సూచికలోనిదే. పుట. 139

వేమన పద్యాల్లోని రాయలసీమ మాండలికాలను రాయలసీమలో వ్యవహారంలో ఉన్న శబ్దజాలం అనవచ్చు. ఈ శబ్దజాలాన్ని మూడువిధాలుగా వర్గీకరించవచ్చు. అవి 1. పదాలు, 2. పదబంధాలు, 3. క్రియావాచకాలు. ఈ పదాలు, పదబంధాలకంటే క్రియాపదాలు మరింత సన్నిహితసంబంధాన్ని మాండలిక స్వభావాన్ని అంటే Nativity ని స్పష్టం చేస్తాయనడంలో ఏవిధమైన సందేహం ఉండనక్కర లేదు. ఈవిషయం పరిశీలనవల్ల అవగతమవుతుంది. ఒక్కొక్క వర్గాన్ని గ్రహించి క్రమంగా పరిశీలిద్దాం.

4.2 పదాలు : నాయీ పరిశీలనలోని పదాల్లో రాళ్ళపల్లి వారు ఉదాహరించినవిగూడా చేరి ఉంటాయనడం వేరుగా చెప్పనవసరంలేదు. అయితే ఆయా సందర్భాల్లో వాటిని తెలుపడానికి యత్నిస్తాను

ఉద్ది:(గూడ) : "ఉద్దిగూడి బ్రతుకు చుంద్రుడువేమ" (వే ప, 140-47) జతగూడి అని అర్థం. ఈనాడుగూడా రాయలసీమలో వాడుకలోఉంది నాట్లు వేసేటప్పుడు, కోతలు కోసేటప్పుడు మొదలైన పనిపాటల్లో ఉద్దులు ఉద్దులుగ పనిచేయడమూ, కోలాటం వేయడమూ, ఈనాడూ చూడగలం దీనికి సామాన్యార్థం ఉద్ది-సమానం అని.

ఎగ్గు : "ఇష్టమగువారి యెంగిలి యెగ్గువేమ" (వే. ప. 128-448) ఇష్టం లేమి అంటే అనిష్టమనిఅర్థం ఇదే అర్థంలోనే ఈపదం వ్యస్తంగ రాయలసీమలో వాడబడుతూంది "వాడు ఎగ్గులేని మనిషి" అనడం మనం వినవచ్చు. కానీ ఇతరప్రాంతాల్లో సమస్తంగా అంటే 'సిగ్గు ఎగ్గు' అనే ప్రయోగం ఉంది.

ఎడ్డె : "ఎడ్డెరెడ్డి కులమేదని చెప్పుమ" (వావిళ్ళప్రతి)[9] ఎడ్డె అంటే మొరటు అని అర్థం. అంటే నాజూకు గానివాడు. ఈనాటికీ "పోరా ఎడ్డె నాయాల" అని తిట్టురూపంలో ఉంది రాయలసీమలో. డా॥ గోపి గారన్నట్లు "ఒడ్డినాయాల" అన్నది మరో ప్రయోగం[10]. ఇదిగూడా ఉంది. నిజమే తెనాలి రామకృష్ణుని ప్రయోగం "ఎడ్డెతనపు క్రైపేతల రడ్డుబు వడచిరి పురస్సరద్వార్యముగా (పాండురంగమాహాత్మ్యము

9,10. డా॥ ఎన్. గోపి : ప్రజాకవి వేమన పు-314,315.

తృ ఆ.వ. 75) ఈ అర్థంలోనే సందేహంలేదు ఇదేరీతిని వేమన ప్రయోగించాడు.

ఎనుము : "ఎనుము గొప్పదైన యేనుగు బోలునా" (వే.వ. 81-131) ఇది రాయలసీమవాడుక, "ఎనుము తిరుగుచుండదే యెద్దువెంబడి" (వే.వ. 122-407) సర్కారుజిల్లాల్లో బర్రె, బరిగొడ్డు, గేదె అనడం మామూలు. అయితే విశేషమేమంటే బర్రెప్రయోగం గూడా వేమనలో కనిపిస్తుంది "చన్నుబట్టనీదు కొన్నబర్రె" (వే. వ. 118-384).

ఏడ : "సిగ్గుయేడదాగు జీకచేడనుడాగు" (వే వ. 55-370). ఎక్కడ అనేఅర్థంలో ఈనాడు ప్రయోగం బహుళంగాఉంది రాయలసీమలో. "వాడు యేడబోయినాడు, వాడింటికి బోయినాడు" అని వ్యవహారం

ఓగు : "ఉత్తముని కడుపున ఓగు జన్మించిన" (వే వ. 6:-2) ఓగు–చెడ్డవాడు, పనికిరానివాడు అనే అర్థంలో వ్యస్తంగా ఈరోజుగూడ మనం రాయలసీమలో వినగలం. కానీ అన్నిచోట్లా సమస్తంగా 'బాగోగులు'లో ఉంది.

ఓలి : "ఓజమాలు హీనజాతి యోలి మాదలచేటు" (వే.వ 65-17) ఓలి–కన్యాశుల్కం ఇది ఈనాడూ రాయలసీమలో కొన్ని కులాల్లో నిలిచిఉంది.

కడి : "కంటకమున దిన్నకడిగండమై వచ్చు" (వే వ 138-50) కడి–మింగడానికి వీలైనంత అన్నపుముద్ద, గోరుముద్ద, ఈకడి అన్నది రాయలసీమలో ప్రత్యేక ప్రయోగమనీ చెప్పవచ్చు. రాగుల విసరిన పిండితో చేసిన చంకటిముద్దను 'కళ్ళ'గా చేసి తినడం పరిపాటి. ఈ అర్థంలోనే ఇది ప్రయుక్తం. పేడకడి అనడమూఉంది. అయితే అన్నపుముద్ద అనే అర్థంలో 'నేతిబొట్టులేకుంటే ముద్దదిగదు" ఇతర ప్రాంతాల్లోని ప్రయోగం.

కద్దు : "పాదతీర్థమునను ఫలమేమి కద్దురా" (వే. వ 127-445) కద్దురా- కలదురా అని అర్థం. కద్దు నిశ్చయార్థకం. పై వేమన ప్రయోగం ప్రశ్నార్థకం. ఇలాగే 'కద్దా?' అని ప్రశ్నార్థకం రాయలసీమలోని వాడుక.

కసువు : "నెయ్యిలేనికూడు నీయాన కసువది" (వే వ 83-143) "కసువు మేరితిన్న పసరపుమైదిన (మాలడంద్రు) (వే వ. 127-444) కసువు- గడ్డి, పరికసువు, పెండుకసువు-అని ప్రయోగం. కసువు-చెత్త. కసువూడ్చినావా-అన్నది వాడుక.

కళవళము[11] : ఇది కన్నడపదం. 'కళవళ'-ఇబ్బంది అని అర్థం. కళవళపడడం అంటే ఇబ్బందిపడడం, చింతించడం, తెల్లబోవడం అనే అర్థాలలో ఈనాడు రాయలసీమలో ముఖ్యంగ కన్నడభాషా ప్రభావంగల ప్రయోగముంది.

కాసు : "కానివానిచేత కాసువీసమురిచ్చి" (వే. వ 6-33) కాసు-తక్కువ విలువగల రాగినాణెము కాసుకు (తరముగాని) కొరగాని నాయాల అని రాయలసీమలోని ప్రయోగం కొన్ని విహంధా ప్రయోగించాడు- వేమన తన పద్యాల్లో.

కొల్ల[12] : సమృద్ధిగాఅనే అర్థంలో ప్రయుక్తం. ఇంతేగాక నాకు చాలు అనే అర్థంలోనే ఉంది.

చులకనగా : "సొరగకున్న చులకనగా జూతురు"(వే. వ 62-414) చులకన-తేలిక అని అర్థం. "చులకనై పోతావురా" అనడం ప్రయోగం ఇతర ప్రాంతాల్లో తేలికగాఅవడం వాడుక. "చులకన జలరుహతంతువు....." (భోజరాజీయము 6-37) అని అనంతామాత్యుని ప్రయోగం పైతం ఉంది.

జోము : "జోమువీడి చేతి సొమ్మెల్లబోజేసి" (వే వ. 170-271) జోము- తిమ్మిరి అనేఅర్థంలో కాలుగాని, చేయిగాని జోముపట్టింది" అని ప్రయోగించబడుతూ ఉంది.

11, 12 పైదే. పుటలు 138,315.

తగరు : "తగరు వెంట నక్క దగిలిన చందంబు" (వే.ప. 6–35) తగరు – పొట్టేలు (గొర్రెపోతు) తగరు అనే రాయలసీమలోని వాడుక.

తావు : "తావు లేనిచోట తావు తానై యుండు" (వే.ప. 112–338) తావు – చోటు, స్థలం అనే అర్థంలో ప్రయుక్తమవుతూ వుంది విరివిగా.

తాళిక : "ధనము లేమెవరికి తాళిక్కై యుండదు" (వే.ప. 148–117). తాళిక– గౌరవం, బలం, సహనం మొదలైన అర్థాల్లో వాడుతారు రాయల సీమలో.

తిక్క : "తెలిసి తెలియలేరు తిక్కనరులు" (వే.ప. 27–184). తిక్క – పిచ్చి, తిక్కోడు–పిచ్చివాడు అని ఈనాడూ అక్కడి వాడుక.

తిరము : "తత్వము తిరమైన తావుల వెదకుచు" (వే.ప. 21–137). తిరము– స్థిర శబ్దభవం "ఇదేమి తిరమా" అన్నట్లు రాయలసీమలోని వాడుక.

తొత్తు : "వనికిమాలు తొత్తు బ తెంబు చేటురా" (వే.ప. 65–17). తొత్తు – లంజ అనే అర్థంలో 'వనికిమాలిన తొత్తు' అని ప్రయోగముంది రాయలసీమలో ఈనాడు గూడాను.

దండి : "దండి వెలుగుచూచి పిండ మధ్యంబున" (వే.ప. 55–371) "దండిని బరమాత్మ తత్వంబు దెలియరో" (వే.ప. 22–145) దండి– అధికం. దండిగా అనే ప్రయోగం రాయలసీమలో ప్రచురంగా విని పిస్తుంది.

దబ్బర : "దబ్బర నిజములను దాను లెన్నగనుక" (వే.ప. 41–272) దబ్బర– మోసం, బొంకు, అసత్యం, 'దబ్బర నాయాల' అన్న ప్రయోగం రాయలసీమలో ఉంది.

దమ్మిడీ : "తటుకు చనులనాడు దమ్మిడీ పేయదో" (వే.ప. 97–244) దమ్మిడీ–కాసు, తక్కువ విలువగల రాగినాణెం. అది దమ్మిడీకి తరం గాదు–చిల్లిగవ్వ చెయ్యదన్న రాయలసీమ ప్రయోగం.

అయ్యవార్లు–బ్రాహ్మణులు. ఉపాధ్యాయులు అనే అర్థాల్లో ఈనాడూ బాగా రాయలసీమలోని వాడుక.

ఒక్క ప్రొద్దు: "నక్క యేమెరుంగు నొక్క ప్రొద్దు" (వే ప. 119-390) ఒక్క ప్రొద్దు–ఉపవాసమని అర్థం. ఈ అర్థంలోనే ఈ పలుకుబడి రాయలసీమంతటా బహుధా శ్రుతమవుతూ ఉంటుంది.

కండకావరము: "కండకావరమున కానరు మరణంబు" (వే. ప. 152-147) కొవ్వెక్కి, మదించి అనే అర్థంలో రాయలసీమలోని వాడుక.

కుదువసొమ్ము. "కుదువ సొమ్ము కెన్న కొంతహాని" (వే.ప. 103-280) కుదువ సొమ్ము–తాకట్టుబెట్టిన వస్తువు. ఇది ఇలాగే రాయలసీమలో ప్రయోగంలో ఉంది.

కొండెగాడు : "కొండెగాడు జావ కొంప దనుకబోవు" (వే.ప. 71-58) కొండెములు అంటే చాడీలు చెప్పేవాడు కొండెగాడు, 'పోరా కొండెగా', 'నా కొండె' అనే రాయలసీమలో ఈనాడూ ప్రయోగిస్తారు.

గుల్లాపువని : "కూలి నాలిజేసి గుల్లాపువనిజేసి" (వే. ప. 10-61) గుల్లాపువని–సేవకావృత్తి; వెధవపని అనే అర్థంలోను, 'పోరా గుల్లాపు నాయాల' అని వాడుతారు రాయలసీమలో.

తప్పెడు : "తళుకు బెళుకురాలు తప్పెడేల" (వే. ప. 2-4). "ఆమె తప్పెడు సొమ్ములు పెట్టుకొంది, తప్పెడన్నం తిన్నాడు" అని ప్రయోగం. తట్టి–ఈతబద్దలతో చేయబడిన గంపలాంటిది. కోస్తాజిల్లాల్లో పలిక అంటారు దీన్ని. పేడతట్టి అని రాయలసీమ వాడుక.

దొడ్డవాండ్లు : "దొడ్డవాండ్ల మనుచు దోవదొంకలు కట్టి" (వే. ప. 74-80) గొప్పవాళ్ళు, పెద్దమనుషులు అనే అర్థంలో ఈ పదబంధం రాయలసీమలో వాడుకలోఉంది. 'మీకేమి దొడ్డవాండ్లు' అని వ్యంగ్యంగా అవడమూ ఉంది.

పిన్న పెద్దతనములు : "పిన్న పెద్దతనము లెన్నదగదు" (వే. వ. 86-162) 'పిన్న పెద్దలేకుండా మాట్లాడుతావా ?' అని రాయలసీమ వాడుక.

ముండమోపి : "ముండమోపి తోటి మునుగుచుతేలుచు" (వే. వ. 96-235) ఇది రాయలసీమలో విస్తృతంగా వాడబడుతూ ఉంటుంది.

ముగ్ద్రాళ్ళు : "ముగ్గురు ముగ్ద్రాళ్ళ మునిగినారు" (వే వ 95-230)

ముక్కుత్రాళ్లు: "ముక్కుత్రాళ్ళుగుచ్చి మురికిపోపగదోమ" (వే, వ 124-425). ఎద్దులకు, గొడ్లకు ముక్కుకు కట్టేతాడు ముకుతాడు. ఇదే రీతిలోనే 'ముగుదాడులేని గిత్తలాగున్నావే' అని రాయలసీమ వాడుక.

ముసలిముప్పున: "ముసలిముప్పునైన మునుగువేమ" (వే వ. 141-73) 'ముసలి ముప్పున తొలిసమర్త' అనే ప్రయోగం రాయలసీమలోఉంది.

4.4 క్రియాపదాలు : పదాలకంటే పదబంధాల్లోను, పదబంధాలకంటే క్రియా పదాల్లోను ఎంతో చక్కగా రాయలసీమ నుడికారం స్పష్టమవుతుంది. వాటిని క్రమంగా చూద్దాం.

అర్లు : "తగులేక నర్లు తామరవలె" (వే. వ. 91-201). వ్యాపించు ప్రాకు అనే అర్థంలో రాయలసీమలోని వాడుక. 'ఈతీగ బాగా అర్లుకొంటా వుంది' అన్నది ప్రయోగం.

ఎడబోనో : తానుయేడపోనొ దనమేడబోవునో" (వే వ 8-47) ఎడబోయెనో- ఎక్కడెకి పోయాదో అనే అర్థంలో ఈ క్రియ రాయలసీమలో వాడుకలో ఉంది.

ఏపారజూచిన : "ఎర్రనాడు దాని నేపారజూచిన" (వే. వ. 83-146) కలయజూచిన అని అర్థం. 'ఏపార జూచినాగు' అన్నది రాయలసీమలోని వాడుక.

కుడువలిడుట : "వట్టువస్త్రములును వరగభూషణములు, కుదువలిడుట లెల్ల కొదువ

వద్దు" (వే వ. 151–140) తాకట్టుపెట్టుట అనే అర్థంలో రాయల సీమలోనే వాడుకలో ఉంది.

కోరుబెట్టు : "కోరుబెట్టె వరముగోరి వేమ" (వే. వ. 131–1) భూమి, (పొలం) కోరుకిచ్చినాడు అన్నది రాయలసీమలోని ప్రయోగం. కర్ణాటకలో దీన్ని వారానికిచ్చినాడు అంటారు. కోస్తాజిల్లాల్లో కౌలుకివ్వడం అన్నది దీనికి సమాన ప్రయోగం.

తర్లిపోయెడు : "తనువువిడిచి తాను తర్లిపోయెడువేళ" (వే. వ. 80–120) ఇదే అర్థంలోనే రాయలసీమలో ఈనాడూ వాడుతారు. "ఊరేగే పెండ్లి కొడుకుని తర్లిపోయే పీనుగుని చూడాలంటారు" రాయలసీమలో. తర్లి పోవడమంటే కాటికి పోవడమని అర్థం.

తారాడు[20] : ఏదో పనిమీద లేదా దొంగతనంగా తిరుగాడడాన్ని తారాడుట అంటారు ఇది ఈనాడు రాయలసీమలో బాగా వినిపించేమాట.

తిరిపోయిన : "తెలియక చెప్పలేక తిరిపోయిన వెన్క" (వే వ. 134–29) మర ణించిన వెనుక అనేఅర్థంలో వాడు తిరిపోయాడు అనే ప్రయోగం రాయలసీమలో ఉంది.

పాలుమాలు : "పాలుమాలి–శ్రమపడి, పాలుమాలిక–శ్రమఅనే అర్థాల్లో రాయలసీమ లోని ప్రయోగం. లోగు అనికూడా.

పూడద్రొక్కు : "పుట్టుమోహమెల్ల పూడద్రొక్కు" (వే. వ. 75–86) నాశనంచేసి అని అర్థం. "పూడదొక్కుతాను వాయాల" అనడం రాయలసీమ లోని వాడుక.

మలచు : "అలయచేసి మలచి యడిగెండ్లు మలిగెండ్లు" (వే వ. 135–34) మలచు– బాగుచేయు. ధాన్యం చేటలోవేసుకొని మలచుటఅనే అర్థంలో రాయల సీమలో వినిపించేమాట.

20. పై దే. పుట. 138.

ముట్టించు : "మూలనొక్క జ్యోతి ముట్టించిచూడరా" (వే. ప 88–177) వెలిగించు అనే అర్థంలో 'దీపం ముట్టించు' అన్న ప్రయోగం రాయలసీమలో ఉంది. తగిలించు, అంటించు అనిగూడా అర్థం.

యంటాడగ : విమలపుకాంతిన్ యంటాడగ బ్రహ్మములోగంటిని" (వే.ప. 62–413) యంటాడగ > వెంటాడగ – వెంటతరుముతూ అనేఅర్థంలో రాయలసీమలో వాడుకలోఉంది.

వగలేక : "కూటికి వగలేక కూర్చున్నవారికి" (వే. వ. 81–129) గతిలేక, చేతగాక అనే అర్థంలో దీన్ని రాయలస్సీమలో వాడుతారు.

వెలుగెల్లపారు: "వెర్రిగాను జూడ వెలుగెల్లపారురా" (వే. ప 19–123) వెలుగు పారింది– తెల్లవారిందనే అర్థంలో ఈ ప్రయోగం రాయలసీమలో ఉంది.

వెళ్ళబారు : "వెలుగుదాటి పీడు వెళ్ళబారు" (వే. ప 63–5). బయలుదేరు అనే అర్థంలో రాయలసీమలో ఈనాడూ ప్రయోగంలోఉంది.

వేలవేసి : "తలను వేలవేసి తాలమించుకలేక" (వే.వ. 123–418) శక్తిలేక తలవేల వేయడమనే ప్రయోగం సమంగా రాయలసీమలో వాడతారు.

వేమన తనపద్యాల్లో వాడుకచేసిన పదజాలం చాలావరకు అన్ని ప్రాంతాలకు చెందిందని అర్థం అవుతుంది. అయితే పై పరిశీలనలో ఆ పదజాలంలో కొంతభాగం ప్రత్యేకించి రాయలస్సీమ మాండలికమై ఉండడం విశేషం, దీనిమూలంగానే వేమన రాయలస్సీమకు చెందినవాడని ఇతఃపూర్వం పెద్దలుచెప్పడం జరిగిందన్న విషయం సత్యం. నా యీ ప్రయత్నం భావి పరిశోధకుల సత్యాన్వేషణకు ఏమాత్రం ఉపకరించినా నేను అదృష్టవంతుణ్ణి

ఈ సందర్భంలో వేమన లోకానికిచ్చిన సందేశాన్ని వాస్తవంగాచెప్పిన నార్ల వారిమాటల్లో ముగించడం సముచితంగా భావిస్తాను

"Poet, philosopher and prophet outstanding in many ways. Vemana has a message for all times and all nations. His relevence to the world of to-day, with its moral crisis, with its ruthlessness, with its loss of a sense of direction, is all the more."[21]

"Sincerely and passionately, he wants man to be rid of all stupidities, superstitions and fears. He wants man to live freely in a free world. Indeed, he is one of the world's best poet-philosophers of human liberty, equality and dignity"[22].

---

21. V. R. Narla : Vemana. P. 69.
22. V. R. Narla : Vemana – through Westeren eyes Introduction. P. 14.



# కోలాచలం శ్రీనివాసరావు (1854-1919)

## నాటకాలు - అన్యదేశ్యపదాలు

సామాన్యంగా రెండు భాషలకు సంబంధం కలిగినపుడు, ఆ భాషలలో కొన్ని మార్పులు జరుగుతాయి. అంటే ఆ రెండు భాషలపై పరస్పర ప్రభావముంటుందని అర్థం. ఒక భాషలో లేని పదాల్ని మరో భాషనుంచి ఎరవు తెచ్చుకోవడం జరుగుతుంది. హాకెట్టు చెప్పినట్లు మాండలికాలు ఎరవు తెచ్చుకోవడం, భాషను ఎరవు తెచ్చుకోవడం అని రెండు విధాలు [1]. పదాల్ని ఎరవు తెచ్చుకోడానికి రెండు కారణాలు పేర్కొన్నారు హాకెట్టు. గౌరవంకోసం గాని, లేదా అవసరాన్నిబట్టి గాని ఒక భాషలోంచి మరో భాషలోనికి ఎరవు తెచ్చుకోవడం జరుగుతుంది బ్లూంఫీల్డు ప్రకారం సాంస్కృతికమూ, సన్నిహితమూ, మాండలికమూనని ఎరవు తెచ్చుకోవడం మూడు విధాలు. కాబట్టి భాషలు ఆదానప్రదానాలవల్ల అభివృద్ధిచెంది సంపన్నమవుతాయి.

1. మన భారతదేశం కొంతకాలం విదేశీ పరిపాలనలో ఉండేది. మహమ్మదీయుల పరిపాలన కాలంలోను, ఆంగ్లేయుల పరిపాలన కాలంలోను, భారతీయ భాషలపై విదేశీభాషల ప్రభావం పడినట్లు స్పష్టం. అదే విధంగా తెలుగుభాషపై పైతం విదేశీభాషల ప్రభావం గోచరిస్తుంది. తెలుగు భాష సంస్కృత పదాల్ని గ్రహించటమే కాదు, వాటివల్ల సుసంపన్నమైనట్లు సర్వజన విదితమే. అదే విధంగా ఇతర భాషా పదాలు తెలుగులో చేరినట్లు సుస్పష్టం.

2. తొలి తెలుగు స్వతంత్ర నాటక కర్తలలో ఒకరైన కోలాచలం శ్రీనివాసరావుగారు [1854-1919] ఇరవై ఎనిమిది నాటకాలను రచించారు. వీటిలో ఎని

---

1. Charles F. Hockett : 'A Course in Modern Linguisties-' Ch. 47. P. 403

2. „ „ : 'A Course in Modern Linguistics-' Ch. 47. pp, 404, 405.

3. Bloomfield : Language - pp 445, 495.

మిది చారిత్రక నాటకాలు, రెండు మరాఠీ అనువాదాలు ఉన్నాయి దక్షిణ భారతదేశ చరిత్రనుంచీ ఉత్తర భారతదేశ చరిత్రనుంచి గూడా వారు నాటక వస్తువులు స్వీక రించారు. రామరాజుచరిత్ర ప్రసిద్ధమైనది (The Fall of Vijayanagar), సుల్తానా చాందుబీ, మైసూరు రాజ్యాభివృద్ధి, చంద్రగిర్యభ్యుదయము, ప్రతాపాత్సరీయము, శిలాదిత్య, సుభమంజరీ పరిణయము, కాళిదాసు అన్నవి-చారిత్రకాలు. మానావ మానము, రాక్షసీమహత్వాకాంక్ష-అన్నవి రెండు మరాఠీ అనువాదాలు.[4] కోలా చలం శ్రీనివాసరావుగారి నాటకాల్లో ఉర్దూ, హిందూస్థానీ, మరాఠీ, కన్నడ, ఇంగ్లీషు భాషలకు సంబంధించిన అన్యదేశ్యాలుండడంలో ఆశ్చర్యం లేదు. ఏ భాషైనా ఇతర భాషనుంచి పదాలను ఎరవు తెచ్చుకొంటే తప్పక ఆ భాష అభివృద్ధి చెందు తుందన్న సంగతి మనకు తెలిసిందే అదే విధంగా కోలాచలం శ్రీనివాసరావుగారు అన్యదేశ్యాల్ని తమ నాటకాల్లో సముచితంగా ప్రయోగించారు.

కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకాల్లో ప్రయుక్తమైన అన్యదేశ్యాల్ని పరిశీలిద్దాం-ఎరవు తెచ్చుకొన్నపదాలు కొన్ని మార్పులుచెందడం సహజమే అలాంటి భాషా విషయకమైన మార్పుల్ని పరిశీలించడమే ఈ వ్యాసోద్దేశం.

3. ధ్వనుల మార్పు :

అన్యదేశ్య పదాల్లో ధ్వనులమార్పు ప్రధానమైనది ఒక భాషలోంచి మరో భాషలోకి పదాలు వచ్చినప్పుడు ఈ మార్పు గమనిస్తాం.

3.1.1 అజంతత :

కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకాల్లోని అన్యదేశ్య పదాలు చాలావరకు అజంతమై ఉంటాయి. ఈ అజంతత తెలుగుభాషకు సహజలక్షణం[5].

తె. సుల్తానుబేగు < ఉ, సుల్తాన్‌బేగ్ (వ్యక్తిపేరు)

పైగంబరు < ఉ. పైగంబర్ (వ్యక్తిపేరు)

---

4. నాసిద్ధాంతగ్రంథం : కోలాచలం శ్రీనివాసరావు-నాటక సాహిత్యసమాలోచనము.

5. Robert Caldwell : 'A Comparative Grammar of the Dravidian Languages'—Part 1, 134]

పాదరి < ఇం. ఫాదర్ (చర్చి అధికారి)

సైదు < ఉ. సైద్ (ముస్లింలలో ఒకతెగ)

పఠాణి < మ. పఠాణీ (వ్యక్తిపేరు)

కొత్వాలు < మ. కొత్వాల్ (పోలీసు అధికారి)

సర్దారు < ఉ. సర్దార్ (నాయకుడు)

నౌకరు < ఉ. నౌకర్ (సేవకుడు)

ఇనాము < ఉ. ఇనామ్ (బహుమతి ఇచ్చిన భూమి)

3.1.2 పై సూత్రానికి అపవాదుగా కొన్నిపదాలు హలంతమైఉన్నాయి. అంటే ఇలాంటివి మూలభాషనుంచి యథాతథంగా గ్రహించబడ్డాయని అర్థం.

| | | |
|---|---|---|
| తె. ఇల్లాజ్‌ఖాన్ | < ఉ. ఇల్లాజ్‌ఖాన్ | వ్యక్తులపేర్లు |
| ఫిరోజ్ | < ఉ ఫిరోజ్ | |
| బీర్బల్ | < ఉ. బీర్‌బల్ | |

3.2 సంయుక్తత (Conjunction) :

తెలుగులో పదమధ్యంలో సంయుక్తతలేదు. కానీ ఎరవు తెచ్చుకొన్నపదాల్లో ఈ సంయుక్తత కనిపిస్తుంది. అంటే అన్యదేశాల్లో యథాతథంగా సంయుక్తత ఉండిపోయింది.

తె. అక్బరు < ఉ. అక్బర్ (అక్బరు చక్రవర్తి)

సుల్తాను < ఉ. సుల్తాన్ (సార్వభౌముడు)

ఇస్మాలు < ఉ ఇస్మాయిల్ (వ్యక్తిపేరు)

కొత్వాలు < మ. కొత్వాల్ (పోలీసు అధికారి)

కుస్తీ < హిం. కుస్తీ (మల్లయుద్ధం)

3 3 వర్ణవ్యత్యయము (Matathesis) :

వర్ణవ్యత్యయమన్నది చిన్న మార్పు. హాల్ పండితుని ప్రకారం ఒక పదంలోగాని, రెండు పదాల్లోగాని స్వరస్థానం మారడం వర్ణవ్యత్యయం.[6]

తె. అమహన్నగరు < ఉ. అహమద్ నగర్ (పట్టణం పేరు)

స్వారి < మ. అస్వార్ గుర్రంపై వాహ్యాళివెళ్ళడం)

3.4 లోపదీర్ఘత (Compensatory Lengthening) :

కొన్ని సందర్భాల్లో ఉచ్చారణలో ఒక వర్ణం లోపిస్తుంది. లోపించిన వర్ణం కంటే పూర్వమున్న వర్ణం దీర్ఘమవుతుంది.

తె. భామినీ < ఉ. బహ్‌మనీ (రాజ్యం) [ఇక్కడ దీనికి తోడు, అల్ప ప్రాణమైన ఉర్దూ 'బ', తెలుగులో 'భ' మహా ప్రాణమైంది]

మదీనా < ఉ. మదీనహ్ (ముస్లింల పవిత్ర స్థలం)

3.5 అల్పప్రాణం-మహాప్రాణం [Aspiration-Unaspiration] :

తెలుగులో మహాప్రాణాలు లేవు సంస్కృత ప్రభావంతో తెలుగులో మహా ప్రాణాలు చేరిపోయాయి. కాబట్టి తెలుగులో మహాప్రాణాలు అన్యదేశ్య పదాల్లోనే గోచరిస్తాయి.

3.5.1 కొన్ని అన్యదేశ్యాల్లో మహాప్రాణత తొలగిపోయింది.

తె. మక్కా < ఉ. మఖ్ఖా (ముస్లింల పవిత్రస్థలం)

పటాణి < మ. పఠాన్ (ముస్లింలలో ఒక తెగ)

గంజాయి < హిం. ఘంజా (మత్తుపదార్థం)

3.5.2 అల్పప్రాణాలు మహాప్రాణాలయ్యాయి తెలుగులో :

తె. భామినీ < ఉ. బహ్‌మనీ (రాజ్యం)

---

6. Hall : 'Introduction to Linguistics'–P. 135.

ఖుస్రూ < ఉ. కుస్రూ (వ్యక్తి పేరు)

ఖాజీ < ఉ. కాజీ (న్యాయాధిపతి)

వాస్తవానికి దీన్ని కృతక ప్రామాణిక పద్ధతి (Feature of hyper forms) అనవలసి ఉంది.

3.5.3 కొన్ని అన్యదేశాల్లోని మహాప్రాణత మారలేదు. యథాతథంగా గ్రహించబడ్డాయి.

తె. ఖాదర్బేగు < ఉ. ఖాదర్ బేగ్ (వ్యక్తిపేరు)

హాల్దీఘాటు < హిం హాల్‌దీఘాట్ (స్థలంపేరు)

యాఖూట్ < ఉ. యాఖూట్ (వ్యక్తిపేరు)

ఖాన్‌ఖాన్ < ఉ. ఖాన్‌ఖాన్ (వ్యక్తిపేరు)

అంగర్ఖా < మ. అంగర్‌ఖా (నిలువుటంగీ)

ఖర్చు < ఉ. ఖర్చ్

3.6 దీర్ఘస్వరం హ్రస్వమవుతుంది (Shortening of Vowels)

పదాదినేగాక పదమధ్యంలోను దీర్ఘస్వరం హ్రస్వమవుతుంది.

తె రుమాల < ఉ రూమాల్ (తలపాగా)

ఇబ్రహీం< ఉ. ఇబ్రాహీమ్ (వ్యక్తిపేరు)

బహదూర్< ఉ బహాదూర్ (వ్యక్తిపేరు)

3.7 వర్ణాధిక్యత (Addition of syllable) :

పదాంతంలో 'యి' గానీ, 'యా' గానీ చేరుతుంది కొన్ని అన్యదేశ్యాల్లో.

తె. సారాయి < హిం. సారా (మత్తును కలిగించే ద్రవం)

గంజాయి < హిం. ఘంజా (మత్తును కలిగించే పదార్థం)

మేరియా < ఇం మేరీ (స్త్రీపేరు)

జోరియా < ఉ. జోరీ/జోరాబీ (స్త్రీపేరు)

3.8 ద్విరుక్తత (Reduplication of syllable)

తె జల్లాలుద్దీన్ < జలాల్ ఉద్దీన్ (వ్యక్తిపేరు)

ఇల్లాజాఖాన్ < ఉ. ఇలాజ్‌ఖాన్ [ ,, ]

మీరుకాశీమల్లి < ఉ. మీర్‌కాశీమ్‌అలీ[ ,, ]

బిబ్బీలు < ఉ. బీబీ (ముస్లింస్త్రీ)

సల్లాములు < ఉ. సలామ్ (నమస్కారం)

3.9 వర్ణలోపం (Loss of syllable) :

ఎరవు తెచ్చుకొన్న స్త్రీ నామాల్లోని 'బీబీ' లోని ఒక 'బీ' లోపిస్తుంది.

తె. సుల్తానాచాందుబీ < సుల్‌తానా చాంద్ బీబీ (ముస్లిం మహారాణి పేరు)

ఆషాబీ < ఉ. ఆశాబీబీ (ముస్లిం స్త్రీ పేరు)

జోరాబీ < జోరాబీబీ ( ,, )

జోదుబీ < ఉ. జోద్‌బీబీ ( ,, )

మహమ్మదుబీ < ఉ. ముహ్‌మద్‌బీబీ (ముస్లిం స్త్రీపేరు)

3.10 సామ్యం (Analogy) :

సాధారణంగా ఏ భాషలోనైనా 'సామ్యం' పాత్ర ఉండనే ఉంటుంది. కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకాల్లోని అన్యదేశాల్లో ఒక ఉదాహరణ మాత్రమే లభిస్తుంది.

తె. మహమ్మదు < ఉ, మ హమ్మద్ (వ్యక్తిపేరు)

అహమ్మదు < ఉ అహ్‌మద్ ( ,, )

'మహమ్మదు' ఎక్కువ ప్రయోగించబడింది. 'అహ్‌మద్' పదప్రయోగం చాలా తక్కువ. ఇది 'మహమ్మదు' సామ్యంతో 'అహమ్మదు' అని వాడబడింది.

4 వర్ణసంయోగం (Phonemic merger) :

మూలభాషలో రెండుగాని, అంతకంటే ఎక్కువగానీ వర్ణాలుంటే అవి తెలుగులో - ప్రాధాన్యం లేకపోవడంవల్ల ఒకేవర్ణం అవుతాయి.

4.1 పదాదిని -

తె. /క/- (Dorsovelar stop) (జిహ్వామూల హనుమూలీయ స్పర్శవర్ణం) < ఉ. /క-/ (Dorsovelar stop)- జిహ్వామూల హనుమూలీయ స్పర్శవర్ణం)

< ఉ. /ఖ-/ (uvular stop పర హనుమూలీయ స్పర్శవర్ణం)

తె. కాసీము < ఉ. ఖాసిమ్ (వ్యక్తిపేరు)

కాగితము < ఉ. కాగజ్ (కాగితం)

కాఫరు < ఉ. కాఫిర్ (ముస్లిం మతంపై నమ్మకలేనివాడు)

4.2.1 స్వరమధ్యంలో -

తె. -గ- (Voiced Dorsovelar stop- జిహ్వామూలీయ హనుమూలీయ నాద స్పర్శవర్ణం) < ఉ.- గ- (Voiced Dorsovelar stop - జిహ్వామూలీయ హను మూలీయ నాదస్పర్శ వర్ణం)

ఉ-గ- (Voiced Pharangeal fricativeపాశ్వపధీననాదోష్మం)

తె. కాగితము < ఉ. కాగజ్ (కాగితం)

జాగీరు < ఉ జాగీర్ (ఇనామ్‌భూమి)

4 2 2 తె. -ష- < ఉ. -శ-(Palatal fricative-తాలవ్యోష్మం)

(Alveolo
palatal fricative
దంతమూలతాలవ్యోష్మం)

తె. అషాబీ < ఉ. అశాబీబీ (ముస్లింస్త్రీ పేరు)
ఖుస్రూ < కుస్రూ (వ్యక్తిపేరు)
అదిల్షా < ఉ. ఆదిల్‌శాహి (వ్యక్తిపేరు)
తమాషా < హిం. తమాశా (ఆశ్చర్యం)
పాదుషా < ఉ. పాద్‌శాహ్ (రాజు)

5. |ఫ|(|f|), |హ| వర్ణాలు :

తెలుగులో మొదట |ఫ| (|f|), |హ| వర్ణాలు లేవు.

5.1 1 ఉర్దూ, ఇంగ్లీషు మొదలైన భాషల సంపర్కంతో తెలుగులో |ఫ| (|f|). వర్ణం ప్రవేశించింది.

తె. ఫిరోజ్ < ఉ. ఫిరోజ్ (వ్యక్తిపేరు)
ఫకీరు < ఉ. ఫకీర్ (బిచ్చగాడు)
కాఫరు < ఉ. కాఫిర్ (ముస్లింమతంపై నమ్మకలేనివాడు)
లతీఫా < ఉ. లతీఫా (ముస్లిం స్త్రీ పేరు).
అఫీము < హిం. అఫీమ్ ఇం. opium > సం. అహిఫేనమ్.
(మత్తును కలిగించు పదార్థం)

5.1.2 అయితే దంతోష్ఠ్య శ్వాసమహాప్రాణోష్మమైన అంటే |f| వర్ణం తెలుగులో |ప| వర్ణంగా మారిన ఒక ఉదాహరణ ఉంది.

---

7. 1) ప్రొ॥ తూమాటి దొణప్ప : ఆంధ్రభాష – హకారాదిపదములు' – ఆంధ్రప్రదేశ్ 1964.
2) ఆర్ శ్రీరామశాస్త్రి . 'A Study of Urdu, Marathi and Oriya Loan-Words in Mackenzie Telugu Kaifiyats'– pp. 108, 109.

తె. పాదరి < ఇం. ఫాదర్ (Father-Lord father-చర్చిఅధికారి)

5.2 ప్రాచీన ద్రావిడంలో /హ/ వర్ణం లేదు. ప్రాచీనమైన తెలుగులోను ఇది కన్పించదు. కానీ అన్యదేశ్యాల్లో ఈవర్ణం గోచరిస్తుంది.

తె. హైదరు < ఉ. హైదర్ (వ్యక్తిపేరు)

హైయతుఖాను < ఉ. హైయత్ ఖాన్ (వ్యక్తిపేరు)

తె. హుమాయూను < ఉ. హుమాయూన్ (అక్బరుతండ్రి)

హల్దీఘాటు < హిం. హల్దీఘాట్ (స్థలంపేరు)

హుక్కా < హి. హుక్కా (పొగపీల్చు సాధనం)

హుళక్కి < క. హుళక్కి (శూన్యం)

హదినాడు < క. హదినాడు (రాజ్యంపేరు)

హొన్ను < క. హొన్ను (బంగారు నాణెం)

6. అన్యదేశ్యాల్లోని పద పదాంశాల్లో (Morphology) కొన్ని మార్పులు కలుగుతాయి.

6.1 అన్యదేశ్యాల్లోని విభక్తి ప్రత్యయాల్లో మార్పువస్తుంది.

6.1.1 ఈ వ్యాసంలోని 3.1.1 అంశంలో గుర్తించినట్లు అన్యదేశ్యాలు అజంతాలని తెలిసింది. పైగా ఇవి 'ఉ' తో అంతమవుతున్నాయి. వీటిలో 'ఉ' విభక్తి ప్రత్యయంలాగా వ్యవహరిస్తుంది.

తె. దర్బారు < ఉ. దర్‌బార్ (న్యాయస్థానం)

వకీలు < ఉ వకీల్ (న్యాయవాది)

అక్బరు < ఉ. అక్బర్ (అక్బరు చక్రవర్తి)

సుల్తాను < ఉ. సుల్‌తాన్ (చక్రవర్తి)

హైదరుబేగు < ఉ. హైదర్‌బేగ్ (వ్యక్తిపేరు)

పీరుసాబు < ఉ పీర్‌సాహెబ్ (వ్యక్తిపేరు)

దౌలతుసింగు < ఉ. దౌలత్ సింగ్ (వ్యక్తిపేరు)

చిత్తూరు < హిం చితోడ్ (స్థలంపేరు)

హల్దీఘాటు < హిం హల్దీఘాట్ (స్థలంపేరు)

6.1.2 'ఉ' దంతమై, ద్విరుక్తిగావడం కొన్నింటిలో కనిపిస్తుంది.[8]

తె. రైమల్లు < ఉ. రైమల్ (వ్యక్తిపేరు)

సూరత్తు < ఉ సూరత్ (రాష్ట్రంపేరు)

ముబారిక్కు < ఉ. ముబారక్ (శుభాకాంక్ష)

6.1.3 -డు

ఏకవచనం, పుంలింగవాచకానికి చివర 'డు' ప్రత్యయం చేరుతుంది.

తె. హుమాయూనుడు < ఉ హుమాయూన్ (అక్బరుతండ్రి)

తురుష్కుడు < ఉ. తుర్క్/తుర్కి > సం. తురుష్కః (మహమ్మదీయుడు)

జాగీర్దారుడు < ఉ. జాగీర్దార్ (జాగీరు భూమిగలవాడు)

6.1.4 -ము

ఈ ప్రత్యయం అమహద్వాచకాల చివర చేరుతుంది.

తె. బీగము < క. బీగ (తాళం)

కెలసము < క. కెలస (పని)

మైదానము < హిం. మైదాన్ (బయలు)

6.1.5 -దారు/-దారుడు

ఇది పార్సీ ప్రత్యయం. (< ఉ. దార్ <. పా.దార్-కలవాడు)

తె. జాగీర్దారు/జాగీర్దారుడు < ఉ జాగీర్దార్ (జాగీరు భూమిగలవాడు)

6.2 లింగవచనాలు :

---

8. "ఉగాగమంబును, ద్విత్వమును తుది హల్లునకగు" - చిన్నయసూరి బాలవ్యాకరణము - తత్సమ పరిచ్ఛేదము - హలంత ప్రకరణము - సూత్రము-౧౮.

6.2.1 వచనం : అన్యదేశ్యాల్లోను తెలుగులో లాగానే '–లు' బహువచన ప్రత్యయం.

| ఏకవచనం : | బహువచనం : |
|---|---|
| పారశీకుడు | పారశీకులు (పార్శీ ప్రజలు) |
| వారసుడు | వారసులు |
| సల్లాము | సల్లాములు (నమస్కారాలు) |
| ఖామినీసుల్తాను | ఖామినీ సుల్తానులు (బహ్మనీరాజులు) |
| ఖర్పు | ఖర్పులు |
| ముచ్చె | ముచ్చెలు (చెప్పులు) |
| బిబ్బి | బిబ్బిలు (ముస్లింస్త్రీలు) |
| సవారి | సవార్లు (గుర్రంపై స్వారిచేయడం) |
| సరదారు | సరదార్లు (నాయకులు) |

మదీనా (ముస్లింల పవిత్రస్థలం) మదీనులు (మదీనాలు అనిఉండవలసింది)

6.2.2 లింగం :

తె. పాదిరి < ఇం ఫాదర్ (Father) చర్చి అధికారులకు గౌరవార్థం ఇచ్చిన బిరుదు. ఇది పుంలింగైకవచనం. కోలాచలం శ్రీనివాసరావుగారు మహతి వాచకైకవచనంగా 'పాదరీ' అని ప్రయోగించడం గమనించదగింది.

తె. మాదిరి < ఇం. మదర్ (Mother) (చర్చిలోని పవిత్ర మాతృమూర్తి)

6.3 సమాసాలు :

సమాసాలు రెండురకాలు. 1. సిద్ధసమాసాలు (Unanalyzed Compounds) 2. సంకీర్ణసమాసాలు (Hybrid Compounds). ప్రతి సమాసంలోనూ పూర్వపదం, ఉత్తరపదం ఉంటాయి.

6.3.1 సిద్ధసమాసాలు (Unanalyzed Compounds) :

ఇతర భాషల్లోంచి మార్పుచెందక వచ్చినవి సిద్ధసమాసాలు.

భామినీ సుల్తానులు (బహ్మనీరాజులు)

నవాబు బీబీలు (ముస్లింరాజుల స్త్రీలు)

జమాఖర్చులు

మక్కా మదీనలు (ముస్లింల పవిత్రస్థలాలు)

6.3.2 సంకీర్ణ సమాసాలు (Hybrid Compounds):

ఇతర భాషాపదాలతో కూడినవి సంకీర్ణ సమాసాలు.

6.3.2.1 అన్యదేశ్యం పూర్వపదంగాగల సమాసాలు.

6.3.2.1.1 అన్యదేశ్యం+తత్సమం:

అమహన్నగరు (నగరంపేరు)

హజారు రాముని (గుడి) [దేవాలయంపేరు]

పరాయి మనిషి (ఇతరుడు)

6.3.2.1.2 అన్యదేశ్యం+దేశ్యం :

తురకదొరలు

పాదిరీ దొర (Lord Father)

బీబీల ముసుగు (ముస్లింస్త్రీల పరదా)

పాదరీల గుడి (చర్చి)

6.3.2.2 అన్యదేశ్యం ఉత్తరపదంగాగల సమాసాలు :

6.3.2.2.1 తత్సమం+అన్యదేశ్యం

బహుతమాషా

రాముని ముచ్చెలు

6.3.2.2.2 దేశ్యం+అన్యదేశ్యం :

సొంత వకీలు

గుర్రముస్వారి

ఇంటినౌకరు

6.4 క్రియలు :

కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకాల్లో అన్యదేశ్య క్రియలు రెండు మాత్రం లభించాయి.

తె. డిమాకుపడు < హిం. దిమాగ్+తె-పడు (క్రియాప్రత్యయం) (గర్వించు)

తె కుణుస్తుంటే < క. కుణు+తె.స్తుంటే (వ్యావహారికరూపం) (ఎగురుతుంటే)

7. సంధి :

కొన్ని అన్యదేశ్యాల్లో సంధి జరిగినట్లు తెలుస్తుంది.

7.1 యడాగమసంధి :

తె. అలియుద్దీను < ఉ. అలి+ఉద్దీన్ [వ్యక్తి పేరు]

కురీన్‌యుద్దీకిష్టి < ఉ. కురీన్+ఉద్దీన్‌కిష్టి [వ్యక్తిపేరు]

7.2 ఉత్వసంధి :

తె. జలాలుద్దీను < ఉ. జలాల్+ఉద్దీన్
[జలాలు+ఉద్దీను] [వ్యక్తి పేరు]
సైదాలీ < ఉ సైద్+అలీ
[సైదు+అలీ] [వ్యక్తి పేరు]
తె. అమహన్నగరు < ఉ. అహ్మద్+నగర్
[అమహద్/త్+నగరు] [నగరం పేరు]

ఇది సంస్కృతసంధి. పదాంతంలోని ద/త కారం 'న'తో కలిసి 'న' కారమైంది.

8. అర్థవిపరిణామం [Semantic Change] :

కొన్ని అన్యదేశ్యాల్లో అర్థవిపరిణామం జరిగినట్లు స్పష్టమవుతుంది.

| తెలుగుపదం : | మూలభాషలోని అర్థం : | తెలుగులో అర్థం : |
| --- | --- | --- |
| బజారి | బజార్ [అంగడి వీధి] | వేశ్య |
| దిమాకు | ఆత్మగౌరవం | గర్వం |

ఈ రెండుపదాలు తప్ప, ఎక్కువగా అర్థం విపరిణామం జరిగిన అన్య దేశ్యాలు లభించలేదు.

9. పై పరిశీలనవల్ల కోలాచలం శ్రీనివాసరావుగారి నాటకాల్లోని అన్య దేశ్యాల్లో కలిగిన మార్పుల్ని గుర్తించాము. అన్యదేశ్యాల్లోని ధ్వనుల్లో, వర్ణాల్లో, పదాంశాల్లో కలిగిన మార్పులతోపాటు అర్థ విపరిణామాన్ని తెలుసుకొన్నాము. ఈ భాషావిషయికంగా జరిగిన మార్పుల్ని సోదాహరణగా వివరించడం జరిగింది. రెండు భాషల ప్రభావం పరస్పరం పడినప్పుడు వాటిలో భాషాశాస్త్రానుగుణమైన కొన్ని నియమాల్ని అనుసరించి మార్పులు జరుగుతాయన్న విషయం స్పష్టం ఒకభాష మరో భాషలోని పదాల్ని ఎరవు తెచ్చుకొని, తన్మూలంగా సుసంపన్నమవుతుందని గూడా మనం గ్రహించగలం. అదేరీతిని ఆనాడు వ్యవహారంలోఉన్న ఉర్దూ, హిందుస్తాని, మరాఠీ, కన్నడం, ఇంగ్లీషు మొదలైన భాషాపదాల్ని కోలాచలం శ్రీనివాసరావుగారు తమ నాటకాల్లో వాడుకచేసి నాటకీయభాషకు పుష్టిని చేకూర్చ గలిగారు.

సంకేతాక్షర వివరణ :

ఇం. : ఇంగ్లీషు, ఉ. : ఉర్దూ, క. : కన్నడం, తె. : తెలుగు, పా. : పార్సీ, ప్రా. : ప్రాకృతం, మ : మరాఠీ, సం. : సంస్కృతం, హిం. : హిందూస్థానీ, < నుంచి ఉత్పన్నమైన, > : మారును.

# మాలపల్లి - భాషా విశేషాలు

1.0 వాడుకభాష బలాన్ని, భావాన్ని చవిచూపిస్తూ, చక్కటి సామాజిక స్పృహతో అనుభవాన్ని జోడించి చేసిన అత్యద్భుతమూ, అనితరసాధ్యమూ అయిన ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి 'మాలపల్లి' నవల. దీనికి దీటైన నవల ఆనాటికీ, ఈనాటికీ లేదు. ముందు వస్తుందేమో వేచిచూడాలి. తెలుగు నవలా సాహిత్యాన్ని పరిశీలిస్తే ఒక్కొక్క నవల ఒక్కొక్క దృక్కోణం నుంచి గొప్పవిగా కన్పించవచ్చు. కాని మాలపల్లి నవల ఎన్ని దృక్కోణాల నుంచి పరిశీలించినా అన్నివిధాలా అత్యుత్తమమైనదిగా అందరికీ ఆనందాన్ని ఆపాదిస్తుంది. తెలుగు నవలా సాహిత్యంలో ఇది మహేతిహాసం (Epic) అంటే అత్యుక్తి కాదు. భాషా విషయంగా పరిశీలించినా దాని విశిష్టత, వైవిధ్యమూ గోచరించక మానదు. మాలపల్లి నవలలో ఉన్నవవారు వాడుకచేసిన భాషను దిఙ్మాత్రంగా పరిశీలించడమే ప్రస్తుత పత్ర ప్రయోజనం.

1.1 'వాడుక భాషలో పుస్తకం వ్రాయడానికి నాకిదే ప్రయత్నం. మాదంకి తగిన గ్రంథములుకూడ లేవు........ శుద్ధమయిన తెలుగుభాష రావడానికి సంస్కృత భాషతో సంబంధంలేని పల్లెటూరివారితో పరిచయముండాలే. మొదట సంస్కృత పండితులు, యిప్పుడాంగ్ల భాషా పండితులూ తెలుగు భాషయొక్క స్వభావాన్ని మార్చారు. అనేక భావాలను తెలియచేసే అచ్చతెలుగుమాటలున్నా సంస్కృతము నుంచో, యింగ్లీషు నుంచో మాటలు అరువుదీసుకోవడం మామూలయింది. అందువల్ల చక్కని తెలుగు మాటలన్నీ మూలబడి భాషలో సాంకర్యం ఎక్కువయింది. వీలయినంత వరకు తెలుగు భాషయొక్క నడక కనుకూలంగా యీ గ్రంథం వ్రాయడానికి ప్రయత్నం చేశాను.

'........వ్రాత భాషను నోటినొక విధంగా మార్చి చదవడానికలవాటు పడడం చేత మామూలుగా మాట్లాడే వాడుకభాష చదువబోతే కొందరికెబ్బెట్టుగా కనపడడం నేనెరుగుదును. వ్రాతభాషను నోటినొక విధంగా మార్చి చదవడాని కలవాటు పడడం చేత మామూలుగా మాట్లాడే వాడుకభాష చదువబోతే కొత్తగా కొందరికి కనబడు

తుంది. మాట్లాడే మో స్తరుగానే చదవడం ప్రారంభిస్తే వాడుక భాషలో రుచి కన బడుతుంది గాని లేకపోతే తెలియదు........'

'..........నాకంటె పల్లెటూరిలో నివసించడమెక్కువ అలవాటు గలిగి తెలుగు భాషయొక్క నిజస్వభావం బాగా గుర్తెరిగిన తెలుగు భాషా పండితులు వాడుకభాషలో వ్రాయడానికర్హులు. అయినా దారిబెడితే బాగుంటుందని ప్రారంభించాను వాడుక భాషావాదులలో గూడా అభిప్రాయ భేదాలుంటవని నాకు తెలుసు. ఇందులో మిత వాదులూ, అతివాదులూ గూడ వున్నారు..........'[1] అని ఉన్నవవారి 'మాలపల్లి' నవలలో వాడుకచేసిన భాషా విషయమైన ప్రస్తావన, ఆనాటికి వాడుకభాషపై పండితు లలో ఉన్న అభిప్రాయాన్ని స్పష్టం చేస్తుంది. అంతకుముందే గిడుగు, గురుజాడలు వాడుక భాషాపరంగా చేసిన కృషిని మనం గుర్తిస్తే ఈ విషయం స్పష్టంకాక మానదు. తన్మూలంగా ఉన్నవ వారి హృదయం ఆవిష్కృతమవుతుంది.

'..........తెనుగు మాటలు, తెనుగు దేశము, తెనుగు సాహిత్యమూ, తెనుగు హృదయము, తెనుగు సంకల్పము మాలపల్లి కనిర్వచనీయమయిన ప్రతిభను నమ కూర్చినవి.

'..........తెనుగు మాటల యింపుసొంపులు, అందచందములు గ్రంథమునం దంతటను గోచరములగుచున్నవి. తెనుగు మాటల సరళ ప్రవాహమానందమును గలుగజేయుచున్నది. గ్రంథము నందుపయోగించిన భాష వాడుక భాషయైనను గ్రాంథిక భాషా సంస్కారమును బడిసినది విభక్తులు, ప్రత్యయములు, సంధులు, పొందికలు నవీనముగ గనుపడినను సులభముగ బోధ్యమగుచున్నది. లక్ష్మీనారా యణగారుపయోగించిన లోకోక్తులు, జాతీయములు, వర్ణనాది విశేషములు గ్రంథము నకు వ్యక్తిత్వము గలుగజేసినవి. సందర్భానుసారముగను నుదాహృతములైన వాక్య ములు గంభీర సరళ మధురశైలికి నిదర్శనములు'[2] అని కొనియాడిన కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి మాటలు ప్రత్యక్షర సత్యం; నవల చదివాక పాఠకులకిది సువిదితమవుతుంది.

---

1. ఉన్నవ లక్ష్మీనారాయణ : పరిచయము–మాలపల్లి. పు. 1, 2
2. కాశీనాథుని నాగేశ్వరరావు : తొలిపలుకు–మాలపల్లి - పుట 10, 11.

2. మాలపల్లిలోని భాషను విశ్లేషించడమంటే మరో అంతటి గ్రంథం రచించడమని అర్థం. ఇక్కడ సూక్ష్మంలో మోక్షంగా, స్థాలీపులాకన్యాయంగా భాషను పరిశీలించడమే నా ప్రయత్నలేశం.

మాలపల్లి నవలలోని భాష వాడుకభాష. ఇందులో ఉన్నవవారు సందర్భోచితంగా మాటలతేటను విస్పష్టం చేయడానికి యత్నించారు. మాటల ఉచ్చారణలో, ఊనికలో వాడుకలోని సొగసుని తీసుకొని రావడానికి ప్రయత్నించారు వ్యక్తిగతమైన వాడుకను స్పష్టంచేశారు సందర్భోచితంగా సంభాషణలు, వర్ణనాదుల్ని వివరించారు దానికి తగిన భాషనే వాడుకొన్నారు. తెలుగులోని సామెతల్ని, ఆమెతల్లా అందించారు గుంటూరు మాండలిక ప్రయోగంలో ప్రావీణ్యాన్ని ప్రవేశపెట్టారు. అన్యదేశ్య ప్రయోగాలు అతికినట్లు వాడి ప్రత్యేకతను ప్రకటించారు వాక్య నిర్మాణంలోను తమదైన ముద్రను ఉన్నవవారు ఉపయోగించారు. వీటిమూలంగా ఉన్నవవారు మాలపల్లిలో వాడిన వాడుక భాషా విశేషం స్పష్టమవుతుంది. క్రమంగా వాటిని పరిశీలిద్దాం

2.1 ఉచ్చారణ : వాడుక భాషలోని పదోచ్చారణలో మార్పు వచ్చింది కొన్ని ఉదాహరణలు :

అరసున్న :- వాస్తవానికి గ్రాంథిక భాషలోనే క్రమంగా అరసున్నకు గల ప్రాధాన్యం తగ్గిపోతూండగా వాడుకలో అక్కడక్కడా కనిపిస్తుంది. వోయింది గాఁవాఁ లె (5): వాఁయికలు కొడుతూ (30), కఁవుచితో గుర్రము వదలించి (262), వద్దాఁలుగు యెకరాలు (118)

అత్వానికి బదులు ఎత్వం :- దగ్గెర (532).

'క'కు బదులు 'గ' :- నేవిగను, యిగను (67)

పదారంభంలో యి, వు లు :- యిండ్లకుటోయి (72), యెత్తితామంటే (74), వుద్ధరించావు (70).

మహాప్రాణాలు :- ఝుట్కా, ఫసందు (69), ముప్పై యెకరాలు (73), యాభై మంది (73), తాచ్ఛారం (74), వద్దాఁలుగు యెకరాల పొలం (118), కొత్తం (118), చెరిసఖం (701), లెఖ్ఖలలో (713).

త్తా < స్తా :— యిత్తామనుకొన్న (38), యె త్తిత్తామంటే (74)

ండ్లు < ళ్లు : జీతగాండ్లు వాండ్లు, యిండ్లకుబోయి (72), కండ్లు (254)

న్వా < హ్నా :— ప్రాణ చిన్వాం, చైతన్య చిన్వాం (179), ఇదిలా ఉండగా Anology మూలంగా కృతక ప్రామాణికంగా వచ్చింది అధ్యాహ్నామైపోయింది (197)

ఆలె < వలెను :— పోయింది గావాలె (5), బుచ్చయ్యని చూడబోవాలె (67), ఇలాగా ఎన్నో ఉదాహరణలు ఉచ్చారణాపరంగా చూపవచ్చు

2.2 చిన్నపిల్లల భాష :

రకరకాల వ్యక్తులు పలువిధాలుగా సంభాషించడం గమనించవచ్చు. ఉన్నవ వారు ఈ విషయం బహు జాగురూకతతో పరిశీలించి మాలపల్లిలో పొందుపరచినట్లు స్పష్టమవుతుంది

చిన్నపిల్లల భాష, పెద్దవాళ్ళ భాషలా ఉండదు ఆ తీరు వేరు. రామానాయుడు కుమారుడు సాహంతో సంభాషించిన తీరులో సాహం మాటలు :— 'అప్పా! చిన మామయ్య నాకు తాషాబండి, పీకే కొన్నాడు మన వూరికి తీసుకుపోదాం!

'రేపు నా బండెక్కి పోదాం! యేమప్పా! మనకు యింకో బండెందుకు'

'యింత మాత్రానికే విరుగుతుందా! నిన్న మూడు రాళ్ళు మోసింది'

'పెద్దవే, గోలుగుండ్లకంటే పెద్దవే'[3]

గొడ్లు కావలాకాసే పిల్లల్లు, రకరకాల వాళ్ళు మాట్లాడిన తీర్లు, పాటలు, తత్త్వాలు పాడినతీరు వారి మాటల్లో స్పష్టమవుతుంది.[4]

2.3 రామదాసు ఇంట్లో భాష :— రామదాసుతో సుబ్బలక్ష్మి చెప్పిన మాటలు :

'సుబ్బలక్ష్మి లోపలికి తిరిగిన మడిమెలతో చాచి కొంచెం అడ్డదగులు వేస్తూ, బిగుతయిన పూర్ణీల పచ్చెడను యెడమచేతి వేలితో సవరించుకుంటూ "చూడన్నా! వాడి చెయబడ, మునసబుగారి బసివిరెడ్డి కట్టు తీసుకొని యెట్లా కొట్టాడో" అని

3. మాలపల్లి, పు 202 203 4. మాలపల్లి పు 44-47.

యెడమచేతి మీదికి జారివున్న పమిటకొంగును పైకిలాగి భుజం చుట్టించి తోళ్ల వేలాడే రవికెలోని దొంత చేతిమీద కడియమును చూపించినది'[5]

సంగదాసు ఇంటికి వచ్చినప్పటి సంభాషణ :

జ్యోతి : అమ్మా చిన్నన్న వచ్చాడే (అని కేకవేసింది)

మాలక్ష్మి : (పడుగెత్తి వచ్చి) మా అయ్యను చూచి యెన్నాళ్ళయిందమ్మా, కండ్లు కాయినట్లుంది

సంగదాసు . వారం రోజులేకా !

రామదాసు : (దొడ్లో నుంచి వచ్చి) చాలవూ వారం రోజులూ ?

సంగదాసు : నిన్ననేకా నీవు చూచింది.

రామదాసు : పనిమేళ్ళా అక్కడికి రాబట్టి.

మాలక్ష్మి : మా అయ్య జన్మకాల కందకున్నాడమ్మా ! యీ పూట అంతగా ఆరగవు.

జ్యోతి : అన్నా ! మనకు బుజ్జామ పుట్టింది.

సంగ : పెయ్యా దూడేనా ?

మాలక్ష్మి : కాదు, మాగాని దున్నేందుకు పుట్టింది"[6]

4 షాహుకారు మాటలు :

షా : గిరాకీ లేదు, బండలూ లేదు, అడిగే దిక్కూ లేదు. మీరు పండినా, యెండినా వ్యవసాయం చెయ్యక తప్పదుకదా ! ఏ రకంలో మేమున్నందుకు దండగో పండగో కొంటూ వుంటాం

సంగదాసు : లాభంలేని సెట్టి వరదబోడు యిదివరికట్లా దీస్తున్నారు ?

షా : తమలో_పాపులూ, పో గురుకా_అవలే రకానికి అయిదు పెట్టాం. నాసికి నూరూ తాంబై; వర్తంకొద్దీ పెట్టాం[7]

5. మాలపల్లి. పు. పు-14  6 మాలపల్లి. పుట. 98.
7 ,, పు. -71

2.5 పాదరీల భాష :

'ఓ నళాన్నైత్రిపోయే జన్లారా ! మీ కాఖ్కోటా సెప్తకొంటాన్ ఇన్ఖోండి.

ఖోండి. మీళ్లుకల్లా, రెఫల్ఖా, పూజచేయఖండీ, ఆయేస్తూ ఆకళ్ళనుంచి పూడిపడినా ఏస్తు, లోఖంలోని పెపాత్ములఖా ఏస్తు మీరు వమ్మొండి, వమ్మొండీ'[8]

2.6 ముస్లింల భాష : గొల్లపిల్లల మాటలు –

'వెంకడు : సాయిబు రొట్టె తెచ్చుకొన్నాదే ! నాకు కొంచెం పెడతావోయ్ !

సాయిబు : నీకి పెట్టి నేనేమి తినాల !

వెంకడు : నా అన్నం పెడతాలె.

సా : మాలవాంఢ్ల అన్నంకీ తిపమంటావూ !'[9]

'ఫరీదు సాహేబు ; క్యావుజీ మహారాజ్

ఫ : లేకపోవడమేమండి మొన్నఎప్పుడో ఎక్దఫా–

ఫ : మాఅయ్యా ఖనం తినిపించాడుగా అండి మళ్ళీ దుకాణం కళ్లి అనల్ పోతున్నానండీ ! నైజీ నత్కూ పూఛో.

ఫ : అమ్మగార్కి రుట్కా అయితేనే ఫసందండీ.[10] ఇలాగా ఆయావ్యక్తుల కనుగుణమైన వాడుకభాషను ఉన్నవవారు ప్రయోగించారు నవలలో.

2.6 ఇంకా సందర్భోచితంగా శృంగారం మొదలైన వర్ణనలు, వ్యక్తుల వర్ణనలు, స్వభావ చిత్రీకరణలు, సంభాషణలు, మతం, యోగం, ప్రేమ, భక్తి, మధుర భక్తి మొదలైన అనేకాంశాలను సముచితరీతిని వర్ణించి ఆ నవలకెంతో వన్నెవాపివి సంతరించిపెట్టారు ఉన్నవవారు.

3. మాండలికం :

మాలపల్లి నవలలో ఉన్నవవారు ప్రయోగించిన భాష ప్రధానంగా గుంటూరు మండలంలో పల్నాటిసీమలోని మాండలికం. అయినా ఈనవల రచనాకాలం 1920–'22 మధ్యన. ఆనాటి ఆ భాషలో రాయలసీమ మాండలికం సైతం కనిపించడం విశేషం.

---

8. మాలపల్లి. పు 364. 9. మాలపల్లి. పు. 43. 10. మాలపల్లి. పు. 68,69.

3.1 గుంటూరు మాండలికం :

'మాలపల్లి లో మాండలిక పదాలు' అనే వ్యాసం రాశారు ప్రొ. మద్దూరి సుబ్బారెడ్డిగారు. ఎన్నో విషయాలు అందులో వివరించారు'[11] అందులోంచి కొన్ని ఉదాహరణలు :

'పెండెం : gate-ప్ర : దొడ్డిపెండెం కదలాగిరా.

లుగచెడు : ఆరోగ్యంచెడు-ప్ర. మాబ్రె కొంచెంలుగచెడ్డట్టు కన్పడుతుంది.

గాబు : తొట్టి-ప్ర : గాబులో కుడితినీళ్ళు ఆ సూడావుకు తావరా.

తనాబీ : దూలం, స్తంభం-ప్ర. మనిషి తనాబీలాగా ఉన్నాడు. ఇంటికి పిమెంటు తనాబీలు వేశారు

బోరెం : మిరపకాయలుకుక్కే పెద్ద గోనెపంచి Bale: పంటి-కుండ, బుంగ-ప్ర : మళ్ళకు నీళ్ళజల్లి పంటి దోనపాదిలో బెట్టాను. కనపడ్డంలేదే ?

ఇలాగా ఎన్నైనా ఉదాహరించవచ్చు.

3.2 రాయలసీమ మాండలికం :

ఆనాటి ప్రయోగాలలో రాయలసీమ మాండలికాలు కనిపించడం విశేషం. అవి ఈనాడూ రాయలసీమలో వాడుకలో ఉండడం గమనించగలం.

కొట్టం : పశువులకొట్టం (10)

మట్టసానికి : తగినంత (14)

మిద్దె : రాతితోగాని, మట్టితోగాని కట్టినఇల్లు (18)

కామకావచ్చి (70) తప్పకవచ్చి-ఇది ఈనాడూ పల్లెటూళ్ళో వింటూంటాము.

మీరుగెవ (73) మీరుగనుక-

గుంటిదగ్గర (78) చిన్నబండరాయి-

ఖాయిలాపడడంచేత (119) అనారోగ్యం పడడంవల్ల

దుబారా (121) ప్రియం.

---

11 ప్రొ. మద్దూరి సుబ్బారెడ్డి, సాహిత్యవివేచన- మాలపల్లి లో మాండలిక పదాలు. పు 94-106.

అప్ప-(202), (203). తండ్రి (సాహూతండ్రి రామానాయుడితో 'అప్పా చిన్నమ్మమయ్య నాకు తాషాబండీ, పీకేకౌన్నాడు మనవూరికి పోదాం')

బేసవారం (204) గురువారం (లక్ష్మివారం)
లాయక్కైన బంజరు (498) తగిన, అర్హమైన
బెమిసి (538) < భ్రమసి, ఇష్టపడి
అగ్గవగా (624) చౌకగా
పతుంబడి (751) రాబడి
అరువు మాలినపని (788) ఉపాయంలేనిపని

ఈ పదాలు ఈనాడూ రాయలసీమలో ప్రయోగంలో ఉన్నాయి. ఇక్కడ అనేకరీతుల మార్పువచ్చి చాలావరకు భాషలోను మార్పువచ్చింది. కానీ అక్కడ ఇంత మార్పులేదు. పాతమాటలే నిలిచిఉన్నాయి. దీనివల్ల ఒకవిషయం స్పష్టం. 1920–22 ప్రాంతంలో తెలుగుభాష చాలావరకు మార్పుచెందక ఇలానే ఉండేదని ఊహించడంలో దోషం ఉండబోదు

4. సామెతలు, లోకోక్తులు :

చక్కని సామెతల్ని ఆమెతల్లా ఉన్నవవారు ప్రయోగించారు తమ నవలలో.

'ఆడబిడ్డ అర్థమగడన్నారు (39)
అడక్కపోతే అమ్మయినా పెట్టదు (65)
లాభంలేని సెట్టి వరదబోడు (71)
చిత్తకు చిరుపొట్టలన్నట్లు (81)
కీడెంచి మేలెంచమన్నారు (131)
కోటివిద్యలు కూటికేగా (137)
కాలుగాలిన పిల్లి మోస్తరుగా (267)
అధికస్యాధికం ఫలం (294)
ఆత్రానికి అమ్మబోతే అడవి, కొనబోతే కొరివి (341)
వేళ్ళ వంకబెట్టితేగాని వెన్నరాదు (342)
యథార్థవాదీ లోకవిరోధీ (427)
సంఘేశక్తిః కలౌయుగే (442)
శతశ్లోకీవ పండితః (652)
దేవుని పెండ్లికందరూ పెద్దలే (759)

ఇలాగా తెలుగేగాక సంస్కృతంలోని సామెతల్ని సైతం సందర్భోచితంగా సన్నివేశించారు

**5. అన్యదేశ్యాలు :**

ఆనాటికి ప్రయోగంలో అనేకాన్యదేశ్యాలు సైతం మాలపల్లి నవలలో చోటుచేసుకొన్నాయి. రచయితకు ఆయా భాషల పైని అధికారాన్ని సైతం ఇది వ్యక్తం చేస్తుంది

**5 1 ఉర్దూ, హిందీ పదాలు :**

ఏక్‌దఫా, ఖసం (69), దుకాణం, నై జీ సబ్ కూ పూఛో (69), ఫసందు(70) షాహుకారు, కోస్తా, గిరాకీ, అవల్‌రకం, బయానా (71), తరఫున (72), షికాయతు (89) హాజరుగా (71), కబురు (90), దామాషా (118), ఖాయిలా (119), దుబారా (221), మకాశిస్తు, హక్కు, జిరాయితీ, దేశ్‌ముఖి (127), కమీజు (145), ఖనాటీ (138), నిషాపీలు (200), జుల్మానా (217) వహరా (230), సలీసు(342) ఇతాహునామా (311), గస్తీ (311), జప్తు (350), ఖైదు (440), లాయక్కాని (498), దాఖలా (530), ఖజానా (536), గలీజు (617) లాఠీ (628), వస్తాదు (716), దర్జా (718)

**5 2 ఆంగ్ల పదాలు :**

రయలు (550), గేటు (70), పోర్డరు (151), బిల్లు (158), ఫేంక్ట్యాపోర్ (155), సబుజెయిలు (452), వాలంటరీ (476), బంగళా (488), కాంపౌండు (516), క్రిమినల్‌కేసు (533), గార్డియను (563), కమిషన్ (645), కాంపన్ సేషన్ (746), పింఛను (749).

ఇలాగా ఇతర భాషాపదాలు ఇందులో చక్కగా అతికినట్లు ప్రయుక్తం కావడం విశేషం.

**6 వాక్య నిర్మాణం :**

వాక్యనిర్మాణం వ్యావహారిక భాషానుగుణంగా ఉన్నప్పటికీ సందర్భానుసారం చిన్నచిన్న వాక్యాలతోపాటు పెద్ద వాక్యాలు, అలంకారిక శైలీ విన్యాస పూరిత వాక్యాలు చక్కటి భాషాశైలీ పూరిత వాక్యాలు ఉండి నవలకు అందచందాలు, బిగి బిగి కలిగిస్తున్నాయి

చిన్న చిన్న వాక్యాలు :

'కమలమ్మ నిలిచి మళ్లీ సాహూవంక వెఱ్ఱిదానివలె చూచింది. కాఠిన్యం వహించిన మనస్సు వెన్నవలె కరగిపోయింది. కళవిళ పడ్డది. మరిగింది.కళ పెళ్ళా డింది. గగ్గోలుపడి ఘూర్ణిల్లిపోయింది [12]

సంశ్లిష్ట వాక్యం :

'మోహనరావు గుంటూరులో రైలుదిగి, అగ్రహారంలో పినతల్లి గారింటికి పోయి, తనకు స్కూలుకు పోయేకాలం మించిపోయిందనీ, రెండు వందలు అవసర మనీ, బలవంతపెట్టి పైకం దీసుకొని రెట్టింపు బాడుగకు మంచి జట్కాబండి మాట్లాడు కొని మంగళాపురం బయలుదేరి నల్లపాటి సత్రాల్లో తాను దిగబడి, బండిని పంపిం చాడు[13]

అలంకారిక వాక్యరచన :

మోహనరావు కమలమ్మను పిలిచిన సందర్భం : 'ఆ పిలుపు కమలకెంతో మధుర గీతంవలె వినబడి ఆత్రంతో లేచివచ్చి దీపపు వెలుతురున లీలావతారం జూచి, ఆనందబాష్పాలు గురిసింది. ప్రపుల్ల నేత్రకమలముల నలంకరించిన బాష్పబిందు వులు దీపపుటరుణ కాంతులలో తళతళ మెరసి ప్రభావము గావించినవి. మోహన మూర్త్యుడు కరకమల దళములతో తుడిచి ముఖ కమలములతో కపోల కమలమును స్పృశించి పోయివస్తానన్నాడు కమల వెక్కివెక్కి యేడ్చింది.[14]

ఇలాగా వాక్యరచన పలువిధాలుగా సందర్భానుగుణమైన నవలా రచనకను కూలమై ఒప్పుతూంది.

7. "వాడుక భాషయందు నవరసభరితమైన కావ్యమును రచించిన లక్ష్మీ నారాయణగారు ధన్యులు సందర్భానుసారముగ చేసిన వర్ణనలు, బోధలు, వ్యాఖ్యా నములు జ్ఞానదాయకములైనను కావ్యరసాను సంధానమునకు ప్రతిబంధకములుకాక కావ్యము పురాణ పరిణామమును బొందిన"[15]దని కాశీనాథుని నాగేశ్వరరావుగారి మాటలు. ఆ నాటికి వాడుక భాషలో ఇంత బృహన్నవల రాసి పెభాషవిపించుకొన్న ఘనత ఉన్నన వారిది. వారు నిజంగా ధన్యజీవులు !

---

13. మాలపల్లి – పు 259 14. మాలపల్లి – పు. 259.
15. మాలపల్లి – తొలిపలుకు 11

# సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 4 | 6 | కపిన | కపిల |
| 7 | 1 | చూనంచ | చూపించ |
| 7 | 24 | కలయిలో | కలయికలో |
| 8 | 5 | పుట్టిన | పట్టిన |
| 8 | 14 | నీర్ఘానికి | దీర్ఘానికి |
| 8 | 20 | పదమఖ్య | పదమధ్య |
| 9 | 17 | మునికిరీటములు | మనికిరీటములు |
| 10 | 9 | వ్వాంతం | స్వాంతం |
| 11 | 21 | బూవతి | బూపతి |
| 17 | 11 | ఆమెను | ఆయెను |
| 18 | 22 | జరపేవు | జరపేవు |
| 19 | 16 | పదవంధాలు | పదబంధాలు |
| 23 | 12 | ప్రయోగింతాడు | ప్రయోగించారు |
| 37 | 11 | మలిదండ్లా | మలిగండ్లా |
| 52 | 12 | ఒద్న చిస్న | చిన్న చిన్న |
| 54 | 9 | ఇంరులో | ఇందులో |
| 75 | 8 | రాళ్ళవల్లి | రాళ్ళవల్లి |
| 77 | 9 | ఖేదాలు | ఖేదాలు |
| 85 | 6 | మక్కు-త్రాళ్ళ | ముక్కు-త్రాళ్ళ |
| 92 | 2 | వర్ణవ్యత్యయం | వర్ణవ్యత్యయం |
| 97 | 12 | వనపదాంశాల్లో | పదపదాంశాల్లో |
| 100 | 8 | అన్యదేశ్యం | ఆన్యదేశ్యం |
| 103 | 12 | పునకం | పుస్తకం |

Acc. No.
12710
20-12-00
894.8134
GAN



## అచ్చయిన రచనలు

విమర్శలు :

1. కోలాచలం శ్రీనివాసరావు - నాటక సాహిత్య సమాలోచనము (పిహెచ్ డి గ్రంథం)
2. క్షేత్రయ్య పదసాహిత్యం (ఆం.ప్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన గ్రంథం)
3. సారంగపాణి పదసాహిత్యం
4. ప్రసంగసాహితి (రేడియో ప్రసంగాలు)
5. తెలుగుదేశపు జానపదగీతాలు.
6. కోలాచలం శ్రీనివాసరావు
7. సాహిత్యోపన్యాసములు-17.ఉన్నవ లక్ష్మీ నారాయణ శతజయంతి ప్రసంగం.
8. సాహిత్యసుధ (వ్యాససంపుటి)
9. జానపదగేయ రామాయణం
10. తెలుగు వాగ్గేయకారులు
11. సారంగపాణికా పద సాహిత్య (హిందీ అనువాదం)
12. తెలుగులో పదకవిత (ఆం. ప్ర. సాహిత్య అకాడమీ అవార్డుపొందిన గ్రంథం)
13. జాతికి ప్రతిబింబం - జానపద సాహిత్యం (వ్యాస సంపుటి)
14. భాషా వ్యాసాలు (వ్యాస సంపుటి)

చిన్న పుస్తకాలు

15. క్షేత్రయ్య
16. పురందరదాసు
17. నాగార్జునుడు

పాఠ్యపుస్తకాలు

18. 8వ తరగతి ఉపవాచకం
19. 9వ తరగతి ఉపవాచకం
20. 10వ తరగతి ఉపవాచకం
21. కమర్షియల్ ప్రాక్టీసు, సెక్రెటేరియల్ కోర్సు-భాగము 1,2. (ఇంటర్మీడియేట్ పాఠ్యపుస్తకం)

కవితలు :

22. బాలగేయాలు
23 నవోదయం

కథలు :

24. తీరినభయం

నవలలు :

25. సుహాసినీవాసం (సాంఘికం)
25. రాజరాజప్రశస్తి (చారిత్రకం) (నాగార్జున, విశ్వవిద్యాలయం బి. కాం. ఉపవాచకం)

ముద్రణలో :

1. తెలుగునాటకం
2. వేయి పడగలు-విశ్లేషణాత్మక విమర్శ (విశ్వనాథ సాహిత్యపీఠం అవార్డు పొందిన గ్రంథం)
3 జానపద గేయాలు
4. తెలుగులో హేతువాదసాహిత్యం
5. విశ్వనాథ నాటకాలు
6. పదకవితా పితామహుడు (నాటకం)
7. పునర్యౌవనం (నాటికల సంపుటి)